# మూలికా యోగము

( చప్పిడి చికిత్సలు. )

గ్రంథకర్త:

ముదిగొండ కోటిలింగశాస్త్రి.

# మూలికా యోగము

( చప్పిడి చికిత్సలు )

గ్రంథకర్త:
ముదిగొండ, కోటిలింగశాస్త్రి.





వెల 0-12-0

1939

## తొలి ప

ఆయుర్వేద సూత్రములు చికిత్సా [illegible] పము రెండువిధములై యున్నవి. అందు ఓషధులతో జికిత్సించుట [illegible] టిపద్ధతి. లోహరసాదులతో జేయుట రెండవపద్ధతి. లోహ రస యోగములను ననుసరించువారు శైవ సాంప్రదాయు లనియు, మూలికాదులచే జికిత్సించువారు వైష్ణవ పక్షమువారనియు పరిగణింపబడిరి. ఈ మూలికాయోగము రచించినవారు శైవదీక్షా పరులగు ముదిగొండ కోటిలింగశాస్త్రిగారు. వైష్ణవసాంప్రదాయములగు గ్రంథప్రమాణములే యాదర్శకములుగ జూపుటలో ద్వివిధపక్షములందు సమదృష్టి జూపిరి. నానావిధములగు వ్యాధులందు పలుతెలుగులగు మూలికలచే నారోగ్యముం జేకూర్చు పద్ధతుల చేర్చుటవలన మూలికాయోగమని గ్రంథమునకు నామకరణమొసగిరి. ప్రాచీన గ్రంథములం దేకమూలికా ప్రయోగ మనియు, పథ్యాదులందు లవణరసము వర్జింపదగినదిగాన దేశీయులు ఉప్పిడిచికిత్స యనియు, ఇంగ్లీషు వైద్యవిధానమందు (సాల్ట్ ఫ్రీ డైట్) యనియు జెప్పుచున్నారు. ప్రాచీనఉద్గ్రంథములలో ఓషధీగుణము, వర్ణము నుదహరించుచు వచ్చినను, ఔషధజ్ఞానావశ్యకత వైద్యునకు ముఖ్యమని నుడివిరి.

మూ॥ యథా విషం యథా శస్త్రం యథాగ్ని రశని ర్యథా।
తథౌషధ మవిజ్ఞాతం విజ్ఞాత మమృతం యథా.
ఔషధం హ్యనభిజ్ఞాతం నామరూప గుణై స్త్రిభిః
విజ్ఞాతం చాపి దుర్యుక్తం అనర్థా యోపపద్యతే॥

ఓషధుల నామ, రూప, గుణములం జక్కగ దెలియక చేయు నౌషధ మొకప్పుడు విషమువలె, శస్త్రములచే మర్మస్థానముల భేదించి మృతిజెందం జేయునట్లు రోగుల జంపునవిభావము. శాస్త్రజ్ఞానము గలిగి సిద్ధపరచు ఔ [illegible] నాటి [illegible] పోషించు

చుండును. ఒకవేళ వ్యాధినొక్కయు నౌషధులనొక్కయు ప్రమాణము తెలిసికొనుటకై వైద్యునకు స్వతంత్రజ్ఞాన మావశ్యకమగును.

శ్లో॥ మాత్రాయా నాస్త్యవస్థానం దోషమగ్నిబలం వయః,
వ్యాధిం ద్రవ్యం చ కోష్ట్యంచ వీక్ష్య మాత్రాం
ప్రయోజయేత్.

దోషముల స్థితి, అగ్నిబలము, వయోభేదము, వ్యాధిస్థితి, ద్రవ్య, కోష్ఠ భేదముల ననుసరించి మాత్రాదులను పరిమితి నేర్పరచు కొనుచుండవలెనే గాని ఔషధప్రమాణములు నిర్ణీతములు గావని తెలియుచున్నవి. ఈ మూలికాప్రయోగములో ప్రతి ఓషధీపరిమితి ననుభవములచే గ్రంథకర్త తెలుపుచు వచ్చెను.

నే డీచిన్నిపెడీ విధాన మాచరించు వారిలో ఆనువంశికముగనో, బైరాగుల వలననో గ్రహించి యితరులకు తెలుపక చికిత్సజేయువారు విశేషము. వీరల చికిత్సలవలన నారోగ్యము జెందినవారికంటె ననారోగ్యము జెందుచున్న వారి సంఖ్యాధిక్యము గాన్పించుచున్నది. ఔషధపరిమాణము దెలియక ఔషధప్రయోగములందు పరస్పర శత్రుత్వములగు మూలికలు గలుపుటచేతను, మూలికలు గ్రహించు పద్ధతి తెలియక పోవుటను, పథ్యాదులు నియమితముగా నాచరించక పోవుటను, వ్యాధి నివారణమునకు బదులు దూషీకృత విషమువలె మహా బాధాకర మగుచుండునని గ్రంథకర్త వాటివివరములు విశదపరచి యుండెను. మచ్చునకు కొన్నిటి నుదహరింతును.

1 గోరింట:- దూషీకృత విషము తెలుపుచున్నది.

2 ఘంటాభారుః:- మూలిక గ్రహించుపద్ధతులు గలవు.

3 హ్రస్వరుగుడుః:- ఓషధుల క్రింద్రియజ్ఞాన మెట్లుండునది తెలుపుచున్నది.

# 4

## కృతజ్ఞత.

ఈ మాలికా యోగములోని చికిత్సలన్నియు వైద్యమిత్రుల రహస్యయోగములై యున్నవి. వీరినుండి గ్రహించుటకై కాలవ్యవధి యగుకొలఁది నా ప్రయత్నములు దృఢమగుచుండెను. ఆయుర్వేదశాస్త్రౌన్నత్య మెంతయని గ్రహించని వారికిఁ దోడ్పడఁగలందులకీ పుస్తకమును రచించితిని. ఇద్దానిపై నేనడిగినంతనే వైద్యవిద్వాన్ శ్రీ వెల్లంకి మహాదేవశాస్త్రి గారు తొలిపలుకును తమ యభిప్రాయమును నొసంగినందులకు వారి కెంతయుఁ గృతజ్ఞుఁడ.

[illegible],
[illegible],
సికింద్రాబాద్ [illegible].

ముదిగొండ, కోటిలింగశాస్త్రి.

# ఇష్ట దైవ స్తుతి.

క॥ శ్రీశైల దివ్య శిఖర ని
వేశా! శ్రిత దురితనాశ! వివిధాభీష్ట
స్వాశాపూరణచణ! స
ర్వేశా! భ్రమరాంబికా సహిత మల్లేశా!

క॥ [illegible] ధన్వంతరి ము
ఖ్యుల [illegible]జ్ఞుల వాగ్భటాదికుల, విద్యాచా
ర్యుల గొలుతు పండితారా
ధ్యుల మార్కండేయపండితుని భక్తిమెయిన్.

సీ॥ శైవాగమాచార సంపన్నులుద్భటా
రాధ్య వంశజులు శాస్త్రజ్ఞులగుట;
వారలే ముదిగొండ వారు నా ప్రఖ్యాత
పండితాఖండలాన్వయజు లగుట;
శివతుల్యుఁడగు చంద్రశేఖరమూర్తి భా
స్వరకీర్తి మా మూలపురుషుఁడగుట;
వంశీయులఖిల విద్వద్వంద్య వైదుషీ
ప్రతిభా విశేష స్వభావులగుట;

తే. గీ॥ సర్వవిధములఁ దత్తదృశిః ప్రసూన
సౌరభ పరాగ లేశమ్ము సంస్మరించి,
మూలికాయోగ సమభిధ పుస్తకాంత
రాయ సమితి దొలంగఁ బ్రార్థన మొనర్తు.

క॥ సకలాయుర్వేదవిధా యక దివ్యరసాయనాది కౌషధ కరణ,
ప్రకటన సహాయమున మామక దైవము వాగ్భటాశ్రిమమున్ నే మెదుతన్

2 వ నెం॥ మల్లప్పఅయ్యవారి రెండవ కుమారుడు సోమన్న అయ్యవారు.

మల్లయ్య అయ్యవారు.

వీరయ్య, భార్య సావిత్రమ్మ

దత్తుడు చినవీరయ్య

♦భార్యఅచ్చమ్మ ♦కూతురునాగమ్మ

పై 3 వ నెం॥ మల్లప్పఅయ్యవారి మూడవ కుమారుడు వీరన్నఅయ్యవారు.

రాజన్నయ్యవారు, భా॥ రపమూర్తి

వీరన్నయ్యవారు. నాగలింగం, ♦ లింగయ్య

నందయ్య. శంకరయ్యకు నాగయ్య, రాజయ్య ♦ లింగయ్య, భా॥ రవమూర్తి

వీరయ్య ♦నాగయ్య. దౌహిత్రుడు, శంకరయ్య.

పులిపాకవీరమల్లయ్య.

వీరనాగమల్లయ్య. కోటిలింగశాస్త్రి. ♦ శేఖరయ్య. రాజయ్య,

పై కృతిపతియగు నాగలింగశాస్త్రికిదత్తు.

♦ ఈగుర్తు నామాదిని గలవారి వరకు తత్పూర్వపరంపర.

## కృతి సమర్పణము.

తే. గీ. దాన ధర్మ పరోపకారానవరత
దివ్య పంచాక్షరీజప దీక్షితునకు,
కీర్తికలిత భిషక్ చక్రవర్తి కిట్టి
మూలికాయోగమును భక్తిపూర్వకముగ
కేవల తదాత్మశాంతి కంకితమొనర్తు.

గ్రంథకర్త:



కృతిపతి

మహా శివపూజా ధురంధరులును

చుండి సంస్థాన పండితులును

కీ॥ శే॥ బ్రహ్మశ్రీ

ముదిగొండ పెదనాగలింగ శాస్త్రిగారు

"పంచాక్షరీ" హైదరాబాదు దక్కన్



గ్రంథకర్త:
ముదిగొండ
కోటిలింగ శాస్త్రి.

గ్రంథాభిప్రాయ
మొసంగినవారు
వైద్య విద్వాన్ వెల్లంకి
మహాదేవ శాస్త్రిగారు,

చున్నవని తెలియుచున్నది. పైఁ జెప్పియున్న సూత్రము చే ఓషధీ వీర్యమును మించిన ప్రభావమునుగూడ నిచ్చు శక్తి గలది యని ఆయుర్వేద సిద్ధాంతమైయున్నది. మరియు ద్వి భూతాధిక్యతచే నొకరసము గలిగి యున్నను మరియొక ద్రవ్యమందు సమాన భూతములు అధిష్ఠత వహించినను గుణమందు వేరుగ నున్నవి. ఎటులన

మ్రంగ:— అగ్ని వాయ్వాధిక్యతచే ఊర్ధ్వభాగమందలి దోషములను హరించుచుండును.

తెగడ:— భూమి ఉదకాధిక్యతచే అధోభాగ దోషములఁ బోకడచున్నవి.

కరక:— ఇది అగ్ని వాయ్వాధిక్యతచే నుండి మ్రంగకు సమానమై యున్నను ఊర్ధ్వ దోషముల బోకడచేక అధోభాగ దోషములు బోకడచు. భూమి ఉదకాధిక్యత గలిగిన త్రివృత్తు యొక్క గుణసామ్యముగు చున్నది.

శ్లో॥ ద్రవ్య మూర్ధ్వగమం తత్ర ప్రాయోగ్ని పవనోత్కటమ్, అధోగామి చ భూయిష్ఠం భూమితోయ గుణాధికమ్.

ఈ సూత్రములే ఆయుర్వేదజ్ఞులు శాసించియున్నారు.

ఈ మూలికా పత్ర పుష్ప ఫలములు స్థావర విషములో జేరినవని అగదతంత్ర సూత్రములచే స్పష్టమగుచున్నవి.

మూల త్వక్కు. [ వేరుపై బెరడు. ] స్వరసము ఇరువది తులములున్ను, మిరియాలు మూడుతులములు, ఆవు నెయ్యి పదితులములు, కలిపి ఇచ్చిన పక్షవాయువు హరించును. రోజునకు ఒక్కతూరి వంతున పై ప్రమాణము గల ఔషధమంతయు మూడు దివసములు ఇవ్వవలయును. ప్రతిదినమున్ను స్వరస మూలికారసమును పదునొకండు తులములను గ్రహించవలెనే గాని మూడుదినములకుగా నొక్కమారు సిద్ధముచేయరాదు. పథ్యము గోమధుబొట్టె, శర్కర, నెయ్యి వారము రోజులు ఇచ్చి రెండవవారములో కఠిన పథ్యము (మిరుపపొడి) నొసగి మూడవవారములో పులుసు ఇతరవస్తువులు నిచ్చుచుండవలెను. దీనిని వివాహసమయములలో కొమ్మలు తెచ్చి కల్యాణమంటపములకు అలంకరించెదరు. ఇట్టి కొమ్మలు భూమియందు నాటుకొని వృక్షమగును లగుచుండును. ఈ ఓషధి మహిమ నశించనట్టిది గాన దీనిచికిత్సచే శరీరము నశించనట్టి స్థిరశక్తి గలిగి యుండునుగాన ప్రథమచికిత్స అందుగురించి చూపబడియున్నది.

( అవిసె. )

శ్లో॥ అగస్తిః పిత్త కఫజి చ్చాతుర్థిక హరోహిమః, నక్తాంధ్య వాతకర స్తిక్తః ప్రతిశ్యాయ నివారణః. అగస్త్య

శిశిరం కొల్యం త్రిదోషఘ్నం భ్రిమాపహం, బలాస
కాస వైవర్ణ్య భూతఘ్నంచ బలాపహమ్.

సొప్ప (మూర్ఛా) వ్యాధులలోనున్న భూత బాధలగ
మును, సర్వవిషములకున్ను ఉపయోగమై యున్నది. ఇందు
పచ్చ పూలుగలిగిన దాని వేరు రసమును మూర్ఛలందు ౫-౬
చుక్కలు ముక్కులో పోయవలెను. స్వప్నములందు పురు
షులకు స్త్రీపిశాచములున్ను స్త్రీలకు పురుష భూతములున్ను
పొనిపించు చుండిన ఎఱ్ఱని పుష్పములు గలిగిన ఓషధిని ఆది
వారము గాని పుష్యమీ నక్షత్రము నందుగాని అమావాస్య
ఆదివారము గాని గ్రహించవలెను. మూలికా గ్రహణము
నకు పూర్వము శుచియై దిననాథునకు నమస్కరించి ప్రాఙ్ము
ఖుడై ధూప దీప నివేదన తొనఁగ ధరించిన గ్రహబాధ ని
వృత్తి యగును. సర్పవిషములందు కృష్ణవర్ణముగల మూల
త్వక్కు రసమును వయో వృద్ధుల ననుసరించి ౫ అయిదు తుల
ముల రసమును ఇచ్చిన విషహారమగును. విషము వమన
రూపముగ గాని విరేచన ద్వారా గాని వెడలును. పశువులు
ఉంగిడి (నాము) తినినచో కామంచిదీనియందుసమానముజేర్చి
ఇరువది తులముల నుండి నలుబది తులముల వరకు ఇవ్వవల
యును. సర్పవిషములకును ఇదేప్రమాణముగా పశువులకు
నివ్వవలెను.

శ్లో॥ కదళీ యోనిదోషాశ్మ రక్త పిత్త హరా హిమా,
తత్కాండ శీతలో బల్యః కేశ్యః పిత్త కఫాస్రజిత్.
తత్ఫలం మధురం శీతం విష్టంభి కఫకృద్గురు,
స్నిగ్ధం పిత్తాస్రతృట్ దాహ క్షతక్షయ సమీరజిత్.

రోధ్రాది గణమునజేరిన ఓషధి ఫలసారము గలది. ఇందు అడవి అరటి, కొండ అరటి, బంగారపు అరటి, నల్లఅరటి బొంత అరటి, అని పలుతెఱంగుల నున్నవి. ఇంక పంట్ల వలన గుణములు మారుచున్నవేగాని దుంపయందు మాత్రము అట్లు మారుటలేదు. ఏవిధమగు చెట్టు అగునో అట్టి జాతి గుణము గలిగియున్నను విశేషముగ ఋతువ్యాధులలో అన్నియు నొకటే గుణముఁ జూపుచున్నవి. ప్రమేహ వ్యాధులలో గుణకారి. గొడ్రాళ్లకుగాని ఋతువు న్యూనాధిక్యతల మార్పుకుగాని చల్లయందు జేర్చి యివ్వవలయును. సూతికాస్త్రీలకు జరాయువు (మకిల, మావి) గర్భమందు నిలిచి కలిగించు వ్యాధులలో మార్పును గలుగఁజేయుచున్నది. గర్భస్రావములందలి అపాయముల తొలఁగించి ప్రాణమును నిలుపుటకు నెక్కువగ తోడ్పడుచున్నది. ప్రకృతుల ననుసరించి కొందఱు క్రమబద్ధము చేకూర్చెను. ఇది ఉపధియొక్క నైజగుణము గాన కాల వ్యాధి ప్రకృతుల ననుసరించి ఇతరములు జేర్చి

౩ మిరియాలు పావుతులము చేర్చి ఇచ్చుట, ఉసిరికాయ ప్రమాణము.

ఔషధ ప్రమాణము, త్రివిధముల వారికి ఒక్కంతియె యయినను పథ్యములందు భేదములు దిగువ నుదహరించిన ప్రకారముగను.

1 మొదటివారు ఔషధమొసగిన దివసమున నేతితో జేసిన మినపగారెలు ఇచ్చి రెండవ దివసమునుండి క్రమ పథ్యము నిడవలెను.

2 ఔషధ సేవన దినమందు పొన్నకుసుమములు ఇచ్చి మరునటి దినమునుండి పై వారివలెనే క్రమపథ్యము లాచరించవలెను.

3 వీరు రెండవపద్ధతి ననుసరించుచు భానువారము మాలిక గ్రహించి వారమునకు ఒక్కపర్యాయమువంతున యివ్వవలెను. పై చికిత్సలన్నియు వారమునకు ఒక్కమాటున మూడువారము లొసంగుచు ఔషధ దివసమున తప్ప మిగతరోజులు పథ్యము సలుపుచుండిన శోషవ్యాధులు హరించును.

ఆర.

శ్లో॥ ధాతకీ కటు తిక్తోష్ణా కఫ పిత్త విసర్పజిత్,
అతిసార రుజం హంతి శ్వయధుం పాండురోగజిత్.

అతిసారమునకు, కామిలా వ్యాధికి నుపయోగపడు చున్నది. మేహవ్యాధులలో ఇతరములు (జమ్మి, కొండ కండి, ఇత్యాదులు) చేర్చవచ్చును. అతిసారములలో పది తులముల చల్లలో అయిదుతులముల దీని వేరు చక్కెరసహ గ్రహించి యివ్వవలెను. పశికర్లలో నున్న ఇదే విధముగ చేసి ముప్పత్త్యమువరకు చల్లతోనే భోజన మొసఁగవలెను. ఆరగ్వధాది గణములో చేరి పుష్పసారము గలదియై యున్నది.

ఇరుగుడు.

శ్లో॥ శింశపోష్ణా హరే త్స్రోహణ్ణా కుష్ఠశ్విత్రి వమి క్రిమీన్,
వస్తి రుగ్వ్రణ దాహాస్రి గర్భగూఢ నిపాతినీ॥

ఆమ్రవర్గములోనున్న అసనాది ముష్కకాది గణ గుణములుగలిగి తీక్ష్ణోష్ణముగ నుండును. గ్రంథుల గరిగించుటకై యుపయోగించుచున్నారు. శరీరపు మీఁదిభాగములందు లేపనాదులచే ఒక్కింత వేదన గలిగించినను ప్రమాదములు చేయుటలేదు. గర్భవిద్రధులు గుల్మములకు లోనికి ఔషధి కషాయరూపముగ త్రాగుటచే గర్భస్రావములఁగలిగించును. పాలలోఁగలిపి ఇచ్చుట నూనెలోఁ గలుపుట రెండు పద్ధతు లున్నవి. గ్రంథులు ఏర్పడి వృద్ధిగాని తరుణములో పాలతో నున్ను, గ్రంథులు వృద్ధియై సామాన్య ఔషధములచే శమింపని ప్రమాదావస్థలలో తైల మందుఁజేర్చి యొసఁగు

చున్నారు. విశేషముగ స్త్రీలకు గర్భగ్రంథు లేర్పడును. సుకు మారులగు ఆడవారికి ఇట్టి చికిత్సలకంటె నిరపాయచికిత్సలు చేయవలెను. ఋతుదోషములు శరీరమందు నిలుచుటచే గ్రంథులు ఏర్పడుటకు హేతువగును. అందు విద్రధులకంటె గుల్మ వ్యాధులు కష్టసాధ్యములని నిదానము ఉదహరించుచున్నది. రక్తజ విద్రధి స్త్రీలకులో నేర్పడును.

శ్లో॥ కృష్ణస్ఫోటావృతః శ్యావ స్తీవ్ర దాహరుజాజ్వరః,
పిత్తలింగో స్రజా బాహ్యః స్త్రీణామేవ తథాంతరః.

రక్తజ విద్రధి స్త్రీపురుష భేదములేక జనించినను పురుషులకు బాహ్యముగను స్త్రీలకు అంతర్వ్యాపకముగను నేర్పడును. ఋతురక్తము పూర్వులచే గర్భాశయాది స్త్రీ ప్రత్యేకాంగములకు సంబంధించినదిగ తెలియవలెను.

శ్లో॥ రక్తగుల్మస్తు స్త్రీణామేవ ప్రజాయతే. రక్తగుల్మ వ్యాధి స్త్రీలకు మాత్రమే ఏర్పడునని తెలియుచున్నది. మాసరక్తము బహిర్గతముగ వెడలక గర్భలక్షణములతో వృద్ధిబొందునని ఈ క్రింది శ్లోకముచే తెలియును.

శ్లో॥ ఋతౌ వా నవ సూతా వా యదివా యోనిరోగిణీ,
సేవేత వాతలానిస్త్రీ క్రుద్ధ స్తస్యాః సమీరణః.
నిరుణధ్యార్తవం యోన్యాం ప్రతిమాస మవస్థితం,
కుక్షిం కరోతి తద్గర్భ లిం[illegible]విష్కరోతిచ.

వ్యాఖ్యాన సాపేక్ష్యాద స్పష్ట దన్యూనం జ్ఞాయతాదికం॥

గుల్మవిద్రధి రోగములలో గుల్మములు దీర్ఘపక్వములనియు విద్రధి దుష్టరక్తోత్థితమైనందున చాలాత్వరగ పక్వమగునని అష్టాంగహృదయములో నున్నది. ఈద్వివిధ వ్యాధులకు ప్రాణములను శోధించునట్టి గర్భపాతముల జేయు మూలికాప్రయోగము నింద్యమగును. ఈ వ్యాధులందు మానఋతువుస మోష్ణములచే బయలువరచుచున్నచో వ్యాధి శమించును. ప్రమాదములు వాటిల్లవు. హేతువ్యాధులలో హేతువ్యాధి విపర్యాస కరౌషధము నిచ్చిన ప్రమాదములు రాజాలవు. గర్భ గ్రంథి విచ్ఛిన్నమైనప్పుడు శిశుగర్భము కానేరముగాన విద్రధి కన్న గుల్మవ్యాధి పక్వ మతిసులభముగా నుండుటచే చికిత్సించవచ్చునని పలువిధముల నభిప్రాయముల జూపుచున్నారు. అతిస్రావముచే ప్రమాదమగును గాన ఔషధ ప్రమాణము దేశ కాల వయో భేదముల నెరింగి చికిత్సించవలెనని తెలియవలెను. రెండుతులముల ఓషధరసమును 6 తులముల పాలుసకలిపి ఒక్కరోజు ఇవ్వవలెను. గుణముగు పడినచో మరునటిరోజు పైప్రకారమే ఇవ్వవచ్చును. గుల్మములందు రెండవదినమునకు గుణముగుపడనిచో మూడవరోజు పైవిధముగనే ఇవ్వవలెను. అనగా విద్రధివ్యాధులలో రెండు దివసములున్న గుల్మవ్యాధులలో మూడుదివసములున్న చికి

త్నించవలెను. సూనెలో నిసటచే అతిశయముగ దాహము తాపము గలుగును. ఒకప్పుడు అతిస్రావ మగుచుండు గనుక ప్రశస్తనీయమైనది.

శ్లో॥ కుండలీ తాలకం వాయు రోగఘ్నంతు జ్వరం
హరేత్, తత్పల్లపంచ వాయుఘ్నం సూతికా వాత
రోగజిత్.

ఇది మూలసారము, పత్రిసారము, క్షారసారముగ నుండు నని పరిభాషలో తెలిపియున్నారు. పై శ్లోకములో మూల మునకు పత్రిమునకు గుణమగుపడుటచే క్షారమును వదలి యున్నారు. అను భావములుజూడ కేవలము మూలమునే గ్రహించు చుందురు. త్రివిధనాగములు వాతమునే హరించుచున్నవి. మూలమందు ఒకటే గుణముండుటచేతను, ఓషధికి ముఖ్యాం గము మూలమగుటచేతను విశేషముగ మూలమ్యొక్కనే ఉప యోగము జేయుచున్నారు. కొన్నిమూలికల నొకసారి చికి త్సించబడిన ఎప్పుడు ఏవ్యాధివచ్చినను తిరుగ నవేమూలిక లుపయోగించినచో వ్యాధి నివృత్తియగునని చప్పిడి చికిత్సా సూత్రములై యున్నవి. అట్టి అభ్యాస మూలికలలో నిది యొకటి. మరియు చప్పిడి గాకు చాడు యని మూడు పద్ధతు లున్నవి. చప్పిడియన నొకమూలికనే గ్రహించి నిజరసమును త్యాగించి, నాటిదినమునుండి ఔషధము ఎన్నిపూట లిచ్చెదరో

అన్ని పూటలు స్నిగ్ధోష్ణకృతముగ అన్నమును మాత్రము ఆహారముగా నిచ్చుట. గాయిందున కొన్ని మూలికలు గ్రహించి వాటిని చాతుర్భాగ కషాయముగఁ గాచి అందు సొంఠి పిప్పలి మిరియాలు మోడి ఇత్యాదులఁ జేర్చి పటుక ములఁజేసి ఇచ్చుట. ఇందుకేని నెయ్యి శర్కర దేహ్యాదుల మాదిరి కలుపను.

చారు, అన గాఢముగు కషాయము మూలికలు గ్రహించి పరిమితమగు నీరుబోసి అష్టావశేషముగఁ గాచి దించిన కషాయము. ఈ చేయుచికిత్సలకు మాత్రము అన్నము ఎల్లిగడ్డ, మిరుపకాయ ఉప్పు, గలిపి ముప్పత్యముపకు ఇచ్చుచుందురు. చెప్పిడి విధానములలో ఆహార విహారములలో అపథ్యాదులు జరిగిన పూర్వవ్యాధిని బోకడచక నూతన వ్యాధుల నుత్పత్తి జేయుచుండును. దూషీకృత విషమును గురించి ముందు చేకొనియందు జెప్పబడియున్నది చూడుము.

చికిత్స:— మేహ వాతవ్యాధులందు, సూతికావ్యాధులకు నివ్వవలెను. మేహవ్యాధులలో అత్యుష్ణముగ గాకుండుటకు ఇతరములును జేర్చుకొనవలె. సూతికా వ్యాధులలో నిజరసమును ఒక్కసారికి రెండుతులములు ప్రమాణమై యున్నది. అవసరముబట్టి ఏడురోజులవరకు ఇవ్వవచ్చును. రోజుకొక సారిమే సేవించుచు. ఇరువదియొక్క పూటలు అన్నా

ముష్ణకృత్యము నాచరించవలెను. ఉష్ణ ప్రకృతిగలవారలకు రసమును శిలాదులచే తప్తతజేయవలెను. తెల్లని పలుగురాయిని కాల్చి రసమందు మునిగించిన రసమందున్న శీతలము ఘాటుదనము హరించి సౌమ్యముగ నుండును. అవసరము గల్గినప్పుడే ఓషధిని గ్రహించి చికిత్సించుచుండవలెను.

ఊడుగ.

శ్లో॥ అంకోలః స్నిగ్ధ రూక్షోష్ణః కఫ రక్తాతిసారజిత్,
వానరాఖు విషం హంతి క్రిమికుష్ఠ వ్రణాపహః
శ్లేష్మ పిత్త వికారేషు యోజ్యా మేత ద్విరేచనం॥

విశేషము సర్పవిషముల వెలిజేయుటకై గ్రహించుదురు. దీనిపత్రములు బీజములు సారముగాగలవి. గరవిషములు ( పెట్టుమందులు ) వమనము జేయుటకై ఎక్కువరసమును ఇచ్చుటచే విస్తారములగు వాంతులు గలిగి నాభిస్థానమందు దోష మధికమై అపాయములు కలుగుచున్నవి గాన వర్జనీయమైనది. సర్పదష్టునకు రెండున్నర తులము మొదలు మూడుతులముల వరకు దేశకాలముల ననుసరించి ఇవ్వవలెను. ప్రమాదముల యందు అయిదు తులముల రసము నిచ్చిన వాంతి విరేచనములు అగును. అగదౌషధములలో మం[illegible]లో నున్ను, ఇతర అనేకయోగములలో [illegible]

దేశీయపదము మూడువిధములుగ పిలుచుచున్నారు. గూదరేణు ] బూదరేణు, ఊదరేణు, దీనిని ఏకమూలికగ నుపయోగ మరుమగ నున్నది. కారణము ఇతరఔషధముల వలెగాక ఒక్క సంవత్సరము వరకు నూనె గుమ్మడి వంకాయ సంజుగత పదార్థములు తినక పథ్యమాచరించవలెను. ఇతర ఔషధులకు ఏర్పడు సంవత్సరమువరకు పథ్యములుండవు. ఇది మలబద్ధకమును హరించుచున్నది. ఈ చికిత్సలలో అత్యుష్ణముచే గాని వాతభూయిష్ఠముచే గాని మలబద్ధకము చేయుస్వాభావికముగ నున్నది గాన అట్టి ఔషధుల న్యూనాధిక్యత సమానము చేయుచు విరేచనము గావించుచున్నది. ఒక్కతులము రసమును ఇచ్చిన చక్కని స్వల్పవిరేచనమై ఉష్ణవాతముల హరించుచున్నది అనేక ఔషధులలో గలియుచుండును.

## ఎలుకచెవి.

శ్లో॥ ఆఖుపర్ణీ రసే స్వాదు ప్రమేహ బహుమూత్రజిత్,
కఫ పిత్తజ్వరే హంతి క్రిమి కుష్ఠభగంధరే.

ఇది పత్రిసారముగలది. వమన సురసాది శ్యామాది గణములలో చేరిన ఔషధి. అతిమూత్రమును హరించును. దీర్ఘసేవనీయమైనది. పచ్చిరసమును అతిశయముగ త్రాగినవ్యాక్తికి శీఘ్రముగ వమనమునుగాని వాంతి విరేచనము లేర్పడు

చేయును. కొంతకాలమునకు తిరుగ మూత్రవ్యాధి ఏర్పడు చుండును. కొండలు మూత్రపుమంట [ చురుకు ] లకు నుపయోగించుచున్నారు. ఎక్కువ గుణకారి మూత్రము మూత్ర మూడే గనుపడును. పూటకు నాలుగు తులముల రసమును నాలుగు తులముల పాలలోఁజేర్చి రోజుకు ఒక్కసారిచొప్పున త్రాగవలెను. ఇట్లు అయిదు దినములు నూతన రసము నివ్వవలెను. పాలు భోజనము ఇవ్వవలయును.

క టూ రి మొ క.

శ్లో॥ స్వర్ణక్షీరీ హిమా తిక్తా కృమి పిత్త కఫాపహా,
మూత్ర కృచ్ఛ్రాశ్మరీ శోఫ దాహజ్వర హరాపరా॥

దేశీయ నామములలో జెట్టిపోతు, తుపాకిమందు పిచ్చి కుసుమ చెట్టు అనుచుందురు. విరేచన గణములలో పరిగణింపబడినది. దీనిఆకు విరిచిన పచ్చని రంగు గలిగిన పాలు గనిపించును. కండ్లకలకలో దీని పాలను అంజనముగ నిడిన కలకలు తగ్గుచున్నవి. అంటు వ్యాధులలో అనగా మేహ చురుకు సవేరియా మధుసవాయి ఇత్యాదులకు ఎక్కువ గుణమును చూపుచున్నది దీని సమూలరసమును పదితులములున్ను జిలకఱ్ఱ ఒక్కతులమున్ను గలిపి ఒక్కపూటకు యివ్వవలెను. ఈ విధముగనే మూడురోజులు రోజుకు ఒక్కసారి చొప్పున యివ్వ

చేసి. దీనిరసము చిక్కని (గాఢముగు రంగుగలిగిన) తెల్ల బట్టచే నాలుగు అయిదు పర్యాయములు వడగట్టవలెను. లేనిచో ముష్టించును గాన ప్రమాదమగును. దీని వేరడు వమనకారి.

## కండోరిగ.

ఇది దళసరి యగు చెట్టు. వేరడు చాలామందము గలిగి యుండును. దీనికి ఒకటిపిడి గలుగజేసిన ద్రవించుచుండును. ఒక్క సంవత్సరము వరకును నూతనముగ గ్రహించిన ఓషధీ రసమున్నట్లులనే యుండును. సామాన్యముగ అరుదుగ దొరుకుచుండుటచే ముందుగనే గ్రహించి యుంచుదురు. విశేషముగ పసులకాపర్ల వద్ద కొండల ప్రదేశములందు సంచరించువారలవద్ద నుండును. పశువులు కొండరాళ్ల మీద జారి కాళ్లు విరిగినను, బెణికినను దంచి కట్టుచుందురు. లోపలికి దీనిరసము పాలలో గలిపి ఇవ్వవలెను. రక్తప్రవాహమగు ప్రతిగాయము ప్రాణములందు అతిశయముగు గుణమును జూపును. విశల్యఘ్నియను మూలికకు బదులుపయోగమగుచున్నది. చిన్నచిన్న ఎముకలను అతికించు శక్తియుగలదు. మేహా వాతశమనము జేకూర్చును. మనుష్యులకు పదితులముల వేరడురసము పది తులముల పాలు జేర్చి ఇవ్వవలెను. పశువులకు యిరువదితుల

ముల రసము 20 తులముల పాలును జేర్చి యివ్వవలెను.

## కాకర.

శ్లో॥ కారవేల్లం హిమం భేది లఘుతిక్తా మహీతలం,
పిత్తాస్రి కామిలా పాండు కఫ మేహా క్రిమీన్ జయేత్,
స్యాత్కారవల్లీ ఫలం మిహాపదుష్టం సర్వామయఘ్నం
రుచిరం క్రిమిఘ్నం, చక్షుష్య మేతల్లఘు దీపనం
స్యాత్, స్త్రీపానస్యా స్విన్నాహాశక్తై స్సమానం.
తిక్త త్రిదోషజ న్నాస్యా కారవల్లీ విషాపహా,
ప్రమేహ శ్వాస కాసార్శ క్రిమి కుష్ఠ వ్రణాన్ జయేత్.
చేదుకాకరకాయలు విషముగా గలవి. అగుటచే జ్వరము
లందు నాభి హరించుచుండును. జ్వరహరమగుచున్నది.
ఇది కామిలావ్యాధిని హరించుచున్నది. తెల్లకాకర అయి
నచో శ్రేష్ఠముగ నుండును. జ్వరములకు కాకరకాయ మందని
ఒకప్రతీతి గలదు. కాకరకాయలోని గింజలు తీసి అందురస
సిందూరము బెట్టి దానిమీద ఎఱ్ఱమట్టిలో తడిపిన బట్టను జుట్టి
పొయ్యిలో నుంచి చిన్న పుటము బెట్టవలెను. ౫ తులముల
బరువు గలిగిన కాయ యున్నచో అరతులము వరకు రససింధూ
రము నుంచవచ్చును. ఒకఘంట కాలమువరకు నుంచి కాయ
ఉడికినట్లు గ్రహించి కల్వమందు చక్కగా మర్దించవలెను.

కొండటు ఇంద పిప్పలి మిరియాలు పావుతులములవరకు గలుపు దురు. కుంకుడు గింజ ప్రమాణముగ వటికలు జేసి ఇచ్చినచో ఆహిక జ్వరములన్నియు మానును. దీనిగింజ గంధమును కామిలావ్యాధియందు కన్నులకు అంజనమిడిన పశిమి రసము హరించుచున్నది. దినమువదలి మరియొకదినము కన్నులకు గంధము రెండు పర్యాయములు అంజనమిడినచో పశికర్ణ వ్యాధులు నశించుచున్నవి. కామిలా వ్యాధులందు పైఔష ధమును కడుపులోనికి నొసంగుచు గింజగంధమును అంజన మిడుచు చల్లతో భోజనమివ్వవచ్చును. కామిలాగాక ఇతర జ్వరాదులందు చల్ల నివ్వక సమయానుకూలముగ అనగా దేశ కాలవయో భేదముల ననుసరించి పథ్యములు ఔషధఅనుపాన ములు యివ్వవలెను.

## కాచమునగ.

శ్లో॥ రక్త శిగ్రు రసే తీక్ష్ణశ్చోష్ణః పవన రోగజిత్,
నాసా కర్ణ శిరోరోగా న్నాశయే ద్వాద్భుతంపరం॥

ఎఱ్ఱని పూలుబూయు దానికే కాచమునగ యందురు వాతముచేత పర్వడుమగతలకు, తడలకు, గుణకారియైయున్నది తీక్ష్ణోష్ణమైనదిగాన దీని సేవనమువలన శరీరమంతయు వేడస తాపము గలుగును. పచ్చిరసముగాని, లేక వెచ్చచేసిన రస

మూషకమయినను శరీరమంతయును దహించబడుచున్నది. కొన్ని సమయములలో యిట్టి తీక్ష్ణోష్ణముచే దోషించుచుండును గాన బహు జాగరూకతతో కొద్ది పరిమాణములతో నారంభింపవలెను. నోరు తెరచుటకు రాక (పక్కళ్లు) పట్టుకొనియున్న స్థితిలో దీని నిజరసమును రెండుచుక్కలు నాసికలో పిడిన తుమ్ములువచ్చి నోరు పట్టువదలును. అప్పుడు గర్భములోనికి అయిదుతులముల రసమును గ్రహించి వెచ్చజేసి శిలలచేతగాని లోహాదులచేగాని తప్త జేసి యివ్వవలెను. ఎనుబది సంవత్సరముల వయస్సు గలవారికిన్ని, సుకుమారులకును రెండున్నర తులముల రసమును మాత్రమే యొసగవలెను.

కాషంచి.

శ్లో॥ కాకాదనీచ తిక్తోష్ణా వాతశ్లేష్మ హరాపరా,
గ్రహదోష హరా కేశ్యా వృధ్యాశోఫ విషాపహా॥

ఇది క్షారసారముగ నుండు మూలిక ఈ రాష్ట్రమందంతటుడగాచి యొనుచుండును. విషములకు, కామిలావ్యాధులకు నుపయోగమైనది. మంత్రపూర్వకముగ సూర్యునకు నమస్కరించి ఆదివారము రోజున ప్రాతఃకాలము (తూర్పువైపు జూచుచు) స్తై రోగిపేరు పఠించి చెట్టును తెంపి వేసినచో ఎండినకొలది పతికెస్ల వ్యాధులు హరించును. విషములందు స్థావర, జంగమ భేదములేక విషమును హరించుచున్నది. కొందఱు

స్థావరవిషమునకు జంగమవిషమును జంగమవిషమునకు స్థావర విషము నుపయోగించుటచే అన్యోన్య శత్రుత్వముచే నొక విషమును మరియొక విషముహరించు ననుచున్నారు. మరి కొందఱు జాంగమమధోగామియనియు స్థావర మూర్ధ్వగామి యగుటవలన విషమును హరించుచున్నదని శ్లోకనిరూపణం జేసిరి.

శ్లో॥ జంగమం స్యా దధోభాగ మూర్ధ్వభాగంతు మౌలజం
తస్మాద్దంష్ట్రి విషం మౌలం హంతి మౌలంచ దంష్ట్రిజం

పై ఇరువురి మార్గము సరిగాదనిరి, విషమునకు అన్యోన్య శత్రుత్వము లేదనియు అందుచే విషహరమగుట లేదనియు, విషమునకు ప్రభావమను శక్తిచే హరించు చుండుననియు తెలుపుచున్నారు.

శ్లో॥ విషం విషఘ్న ముక్తంయ త్ప్రభావ స్తత్ర కారణం,
స్వర్ధంతే కేచి దేతస్మి న్మార్ధ్వాధోగామి హేతుతః.
అసత్యం త ద్యతోదృష్టం విషఘ్నం మదనం త్రివృత్.

ఊర్ధ్వగామియగు మంగ వాంతి జేయుచున్నది. అధోగామియగు త్రివృత్ [తెగడ] విరేచనము గావించుచున్నది. గాని అన్యోన్య శత్రుత్వముచే త్రివృత్ ఊర్ధ్వగామియు మరింగ అధోగామి యగుట లేదనుచు విష ప్రభావముచేతనే విషమును హరించుచున్నదని శాసించిరి. అనుభవములలో

కామంచి చెట్టురసము సంశమనౌషధ మగుచున్నది.

శ్లో॥ న శోధయతి న ద్వేష్టి సమాన్దోషాంఃస్తథోద్ధతాన్,
సమీకరోతి విషమాన్ శమనం తద్యథా మృతా.

శరీర పోషణకు వలసినంత ప్రమాణమగు వాత, పిత్త, శ్లేష్మముల గాపాడుచు అధిక దోషములను సమముగ జేయు శక్తిగల తిప్పతీగె మొదలగు నవి సంశమనౌషధ గుణమనిరి. అందుచేతనే సర్వవిషములకు మనుజులకే గాక పశువుల (వుంగిడి) నాము తినిన వ్యాధులకు సహా యిచ్చుచున్నారు. పూటకు మూడుతులముల రసము వంతున ౨-7 పూటలు కామిలా వ్యాధులకు లోనికిన్ని విషములందు ఒక్క మోతాదుకు 10 తులముల నుండి 15 తులముల వరకును ఇవ్వవలెను. అజేయఘృతములోనున్న, విషహరౌషధము లనేక మందును గలువుచుండును.

కుంకుడు.

శ్లో॥ అరిష్టక స్త్రిదోషఘ్నః ఉష్ణో గర్భ గ్రహాపహః.

శ్వాస కాస వ్యాధులలో గుణమును జూపుచున్నది. కఫము గట్టిదనము వహించి దగ్గినను ఉమియుటకు వెలిగాని [illegible]ములలో దీని రసము అరతులమునుండి ఒక్కతులము [illegible] [illegible]గిన వమనమై చిక్కదనము వహించిన శ్లేష్మము వెడలి[illegible] వ్యాధులకు కొంత గుణకారి యగుచున్నది. త్రిదోష

ములు హరించునది యైనను, వమనముఁ జేయు గుణముగూడా గలదు. అందుచేతనే దీని గింజను గంధముతీసి అంజనమిడినను భుజించినను విషహార మగుచుండుటచేతనే అగదతంత్రములో సర్పచికిత్సకై యుపయోగించు చున్నారు. ఈచెట్టులో స్త్రీ పురుషభేదములచే గ్రహవైద్యమందు వేర్వేరుగ జేయుదురు. పురుష శిశువులు జనించి పదేపదే గతించుచుండిన స్త్రీకి కాయలు గాయని మగచెట్టుయొక్క వేరును గ్రహించుటయు స్త్రీశిశువుల మరణ మప్పుడు కాయలు పండ్లు ఫలించు ఓషధీ మూలమును అభిమంత్రించి ధూపదీపముల నొసఁగి గ్రహ నక్షత్ర వార తిథులందు ధారణజేయు చుందురు. గాని ఇండ్ల ఊరికి సమీపములోగాని ఇండ్లలో నున్న వృక్షములుగాని దీపము వెలుతురుఁ జూచును గనుక భూత వైద్యమందు నింది తమని కొందఱభిప్రాయము నొసఁగియున్నారు.

సాతువు ఖపేనా.

శ్లో॥ ఏలేయకం తు తిక్తోష్ణం సుగంధం శ్లేష్మవాతనుత్,
భ్రమ కుష్ఠ ప్రమేహఘ్నం విషవ్రణ విశోధనం॥

ఇది రోధ్రాదిగణములోఁ జేరినది. ఏకమూలికా ప్రయోగ ముచే మలమూత్రముల స్తంభింపఁజేసినను ఇతర మూలికలతు జేర్చినప్పుడు మాత్రము విరేచనకారి యగుచున్నది. రెండు విధముల ప్రయోగముగ నున్నది. ఒకటి చప్పిడి చికిత్స

ఎన్నియు విశేషముగ పచ్చిరసములతోఁ గూడి అతిపైత్యముగ నుండును. గావ నట్టి పైత్యమును విరేచన రూపముగ జేయించుటకై మిశ్రితము జేయుచుందురు. ఈలా ప్రభావముచే విషమును హరించుచుండును. గాన ఆజేయ ఘృతమునందును ఇతర విషహ రౌషధములందు నుపయోగించు చున్నారు. పూటకు 2-½ తులము రసము వరకు ఇవ్వవచ్చును. ఈ ప్రమాణము విషహర మగుచున్నది. ఇతరములందుఁ జేర్చునప్పుడు మిశ్రిత ద్రవ్యము సమానముగను ఏకమూలికచే పైత్య శమనము మాత్రము జేయుటకు గాను ఒక్క తులము రసమున్ను ఇవ్వనగును. దినమునకు ఒక్కసారి వంతున అవసరమగుచో మూడు లేక అయిదు దినముల వరకు ఇవ్వవలెను.

## కొండపిండి.

శ్లో॥ భేదనో హన్తి దోషార్శో గుల్మకృచ్ఛ్రాశ్మ హృద్రుజః,
యోనిరోగా న్ప్రమేహాశ్చ ప్లీహ శూల వ్రణానిచ.

మేహ రుగ్ణతలో గుణకారి. ఇతర మూలికలకు చేర్చి చికిత్సించుటయు గలదు. శుక్రనష్టముచే బలహీనత హృదయ దౌర్బల్యత యేర్పడిన వ్యాధులలో శుక్రదార్ఢ్యత గల్గించుచున్నది. మరియు మూత్ర ప్రతిబంధకములందు వాయువుచే నిరోధింపఁబడినను మూత్ర శిలలచే ప్రతిబంధకము గల్గియున్నను పూటకు నాలుగుతులముల వంతున మూడురోజుల

పంతు నిద్రపోవును. కొందరు కిష్కు సేవలకు సామాన్యముగు పథ్యములనిడి జిలకర్ర, శొంఠి, అరటులము వంతు గలిపి ఇచ్చుచుందురు.

నం ౩౦ త.

శ్లో॥ ప్రైరేయః కుష్ఠ వాతాస్ర కఫ కండూ విషాపహః,
తిక్తోష్ణోమధురో నస్యః సుస్నిగ్ధః కేశరంజనః.

వల్లి పంచమూలములోఁ జేరిన ఓషధి. పసిబిడ్డలకు విశేషముగ గలుగు కోరింతదగ్గులందు నుపయోగకారి. ఆదివారము గాని, గురువారము గాని ఏని తీగను గ్రహించి హారము మాదిరి మెడయందు ధరించినను, లేక ఒక్కచుక్కలము రసమును లోనికి త్రాగించినను దగ్గు నివారణ యగును. భోజనముఁ జేయు బాలురకు తల్లులు పథ్యముఁజేయ నక్కరలేదు. కొందరికి వాంతియు మరి కొందరికి విరేచనమును జేయుచుండును. తిక్తోష్ణో మధురో నస్యః. అని నస్యము మధురము, అమ్లము ఎట్లు సమన్వయించ నగునని కొందరు ప్రశ్నించుచున్నారు. ఇట్టి ప్రశ్నకు ఈ క్రిందిసమాధానము.

శ్లో॥ స్వాదుః పటుశ్చ మధుర మమ్లోఽమ్లం పచ్యతే రసః,
తిక్తోషణ కషాయాణాం విపాకః ప్రాయశః కటుః.

కొన్ని ద్రవ్యములు తరుచుగ తమ రసమును బోలిన విపాకము గలిగియుండును. ఎటులన కరక్కాయ రసమందు

కషాయత్వము ఆధిక్యతవహించి యుండును. కటుతిక్త కషాయములు విపాకమందు కటువుగను శీతలవీర్యముగ నుండవలెను. గాని కటువుఁజెందక మధురవిపాకమును జెందుచున్నవి. కటురసమునకు జెందిన శొంఠి గూడ కటు విపాకముఁ జెందక మధుర విపాకమగు చున్నది. అందుచేతనే సూత్రికారులు "స్వాదు రమ్ల విపాకోన్యే ప్రీహిః" యని జూపుచు పైశ్లోకాన్వయమంమ ప్రాయశః అనుటచేత తరుచుగ యని స్పష్టీకరించిరి. గుణము రసమును పురస్సరించుకొని యే యుండునని యీ రసాదులకు పత్యేక కార్యకర్తృత్వమందు

శ్లో॥ రసే రసా తుల్యఫల స్తత్ర ద్రవ్యం శుభాశుభమ్,
కించిద్రసే నకురుతే కర్మపాకే నచాపరమ్.
గుణాంతరేణ వీర్యేణ ప్రభావేనైవ కించన॥

యని శ్లోక ముదహరించి యున్నారు. ఇట్టి కారణములచే మధురో నమ్లః అనుట న్యాయమేసనియు గుణమునందు రస కృత్యమును అనగా శ్లో॥ ఆమ్లోగ్ని దీప్తికృత్స్నిగ్ధో హృద్యః పాచన రోచనః ఉష్ణవీర్యో హిమస్పర్శః ప్రీణనః క్లేదనో లఘుః ఇత్యాది కార్యములు జేయుచున్నదనియు నెరుఁగవలెను.

కోలము ఖా.

ఇది చాలా చేదుగా నుండును. దీనిని శ్వాసకాస వ్యాధులలో దీర్ఘకాలము ఇచ్చుచు కఠిన పథ్యములాచరించిన

నిశ్శేషముగ హరించుచున్నది. ఔషధ ప్రమాణ మతిశ యించి ఇచ్చుచుండిన అతిచేమదనముచే వాంతులుగాని లేక ఇతర ఉద్రేకములుగాని గలిగించు చుండును. దినమునకు రెండుపర్యాయముల వంతున వారము సేవించవలెను. చెక్క రసము 3 తులములున్న పాలు, ౬ తులములును రోజు1-కి ప్రమాణమై యున్నది.

గచ్చ.

శ్లో॥ కంటయుక్తః కరంజస్తు పాకే చ తువరః కటుః,
గ్రాహక శ్చోష్ణవీర్యః స్యా త్తిక్తః ప్రోక్తశ్చ మే
హహా, కుష్ఠార్శో వ్రణ వాతానాం కృమీణాం
నాశనః పరః, పుష్పంతుచోష్ణవీర్య స్యాత్తిక్తం వాత
కఫామ హమ్॥

దీనిగింజ శూలలందు అతిసారములందు గుణకారియై యున్నది. చప్పిడి చికిత్సకులు పక్షవాయువుచే హస్తపాద ములు కృశించిన తరుణములో నలుబది రోజులవరకు ఇచ్చు చుండుటచే పూర్వవిధముగ హస్తపాదములు స్థూలించు చున్నవి. పూటకు రెండుతులముల చెక్క రసమున్న, మిరి యాలు మాసం ఎత్తును దీనికి సమానముగ వెల్లిపాయలును గలిపి దినమునకు రెండుపర్యాయములు ఇవ్వవలెను.

## గలిజేరు.

శ్లో॥ పునర్నవా సదాతిక్తా రూక్షోష్ణా మధురా కటుః, హృత్వా శోఫం కఫంవాతం కాస మర్శం వ్రిణః హారేత్. పాండూర్తి విషోదరం శూలం హృద్రోగో తః క్షతాపహా, ఘృతేన మూలకం చాస్యా హ్యః జితం హంతి పుష్పకం, మధునాసహ మూలంతు హ్యంజితంనాగ్రిఫనాశనం, అంజితం మార్కవరసై ర్నేత్రకండూ నివారణం॥

బలేన గోశకృత్తాచ పిప్పల్యాచాంజితం యధా.
రాత్ర్యాంధ్యం నశ్యతే తేన చోష్ణః పర్ణ రసస్మృతః,
తచ్ఛాకస్తు వర స్తిక్తో రూక్షో వాతం కఫం హారేత్.
శ్వాస కాసోదర విషపాండు గుల్మ క్షయార్శకాః.
అగ్ని దీప్తికర శ్శోఫ హానో రేచనకః స్మృతః॥

విదార్యాది గణములో జేరి పత్రి మూల క్షారసార ములుగా గలదిగ నున్నది. మరియు మధ్యమ పంచమూల ములో జేరి విషహారమై మంత్రపూర్వకముగ గ్రహించు ఓషధియై యున్నది. పశువులకు గాయములు మానక పురు గులు ఉత్పత్తియగుచున్నపుడు ఆదివారము, గురువారము ఆమావాస్య ఆదివారముగాని చెట్టుకు ధూప దీప నివేదన లొసగి సూర్యునకు నమస్కరించి భూమినుండి చెట్టును పెరికి

వేసిన మూలిక ఎండిన కొలది ప్రాణమందలి క్రిమినశించుచున్నది ప్రతిపల్లె గ్రామములో పశుకాపర్లందరికి తెలిసియుండును. మనుష్యులకు కామిలావ్యాధి వచ్చినను పైవిధముగనే యుపయోగించవలెను. కొందఱు సమూలముగాని మూలమును గాని దంచి తీసిన రసము పూటకు రెండుతులముల వంతున మూడురోజులు ఇచ్చుచున్నారు. వేరును అంజనమిడుదురు. సంజువ్యాధులలో నహితము ఇవ్వవచ్చును. ఇందు తెల్లని పూలుగలది శ్రేష్ఠముగనుండును.

## గండుత్తరేణు.

ఇది ఉత్తరేణుచెట్టులో నొకభేదముగ నుండును. ఎఱ్ఱగా నుండి కాడలు లావుగాను ఆకులు వైశాల్యముగను అనగా సామాన్యమగు ఉత్తరేణుకంటె కించి దతిశయముగ గన్పట్టుచుండును. చప్పిడి యోగములలో పైత్య మతిశయించకుండుటకై యుపయోగించుచున్నారు. దీని ప్రమాణము అతిశయమైనచో శీతలమును గలిగించుచుండును. తక్కువ ప్రమాణముగ నున్న విరేచనము గావించుటకును పైత్యము హరించుటకును శక్తిజాలక యుండును గనుక ఇతర మూలికలకు జేర్చునప్పుడు ప్రమాణము విశేష జ్ఞానముతో నియమించుకొనవలెను. ఇది కూతురుబుడమ చిన్నంగి మొదలగు పైత్యహారమును మలబంధమును తొలిగించు చప్పిడి చికిత్సలకు అను

కూలముగ నున్నది. అందుచేత ఈ ఓషధులు అనేక మిళిత యోగములలో ఉపయోగములుగ నున్నవి. పచ్చిరసముకన్న వెచ్చజేసిన రసము। అనఁగా శిలాదులచే చురుకు నివ్వబడినది సౌమ్యముగ నుండును. ఒక్క రోజుకు ఏకమూలికా ప్రయోగమైనచో తులము రసము ప్రమాణముగ నున్నది. మూడు దినములవరకు నివ్వవచ్చును.

గాడిదగడపాకు.

శ్లో॥ వాత శ్లేష్మ జ్వరహరా సంధ్యస్థినీ ప్రసారిణీ॥

చాలా చేదుగలిగి యుండును. శూలవ్యాధులు బోకడుచును. ఋతుశూల, గర్భవాత శూలలలో ఎక్కువ గుణమగుపడు చును. మనుష్యులకు నుపయోగించు నప్పుడు విశేషముగ ఇతరమూలికలు జేర్చగూడదు. ఇందు పచ్చిరసము నిచ్చుటకంటె తప్తముఁజేసిన రసము నిడుటయే శ్రేష్ఠముగ నుండును. పచ్చిరసపు చికిత్సలో నొకప్పుడు ఋతుశూలలో నొసఁగిన మున్ముందు గర్భవతినిఁ గానివ్వక గ్రంథి విద్రధులు మొదలగు వ్యాధుల నుత్పత్తిఁ జేయునను వదంతి యొకటి గలదు. కషాయమునందు అట్టి గుణరహిత మగుననిరి. కషాయముకంటె అర్కమును గ్రహించి సర్వదా యుపయోగముఁ జేసినచో సకలశూలవ్యాధుల దునుమాడును. ఒక తులము రసము ఒక్కతూరికి ప్రమాణ మగుచున్నది. కషాయము

1-½ ఒకటిన్నరతులము ముప్పది సంవత్సరముల వయస్సు కలిగిన వారలకును, యిరువది సంవత్సరముల వయస్సులో నుండిన వారికి ముప్పది సంవత్సరములు మీరినవారలకు ఒక తులము నివ్వవలెను. అర్కము సుమారు రెండుతులములు వరకు ఇవ్వవచ్చును. అవసరమగుచో ముప్పావుతులమువంతు దినమునకు రెండుపర్యాయములు ఇవ్వవచ్చును.

గుంటగలగర.

శ్లో॥ మార్కవ స్తిక్త రూక్షోష్ణః శోథామ కఫ పాండు నుత్, చక్షుష్యః కుష్ఠ కండూఘ్నః కేశ్యో మేధ్యో రసాయనః॥

ఇది గనేరియా రుగ్మతలను హరించుచున్నది. దీనిని లోనికి త్రాగిన దినసమున సాయంత్రమువరకు భోజనము జేయక అవసరమగునప్పుడు డంతయు చల్లను మాత్రమే త్రాగుచు నాటిరాత్రికి మాత్రము కేవలము చల్లతో భోజనము జేయుచు మరుసటి దినమునుండి వారము దినములవరకు కఠిన పథ్యాదులును పై దినములందు క్రమ.పథ్యము విడుచుచుండిన సమస్త అంటువ్యాధులు హరించును. యిరువది సంవత్సరముల వయస్సుకు లోనగు వారలు ఈపరిమాణము నోర్వజాలరు గాన వయోబలములం జూచి ఔషధనియమము సేర్పరుచు కొనవలెను. సమూలము దంచి తీసిన రసము ఇరువది

తులములు ఆవు ఎర్లిపాయలు మూడు, దుష్టుపాకులు ఏడు, మిరియాలు అయిదు, మంచి నువ్వులనూనె తొమ్మిది చుక్కలున్ను గలిపి ఇవ్వవలెను. ఒక్కరోజు ఒక్కసారి మాత్రమే యివ్వవలెను. పై దినములందు నివ్వరాదు. సుకుమారులకు ఔషధము తగ్గించునపుడు మూలికారసము తగ్గించుకొనవలెనే గాని ఇతర వస్తువు లేమియును తక్కువచేయరాదు. పత్రిసారముగా గలది.

## గు రి వి ం ద.

శ్లో॥ గుంజా తిక్తోష్ణ కటుకా కండూ కుష్ఠ వ్రణాపహా.
వర్ణాతి వీర్యబలదా విషగ్రహ భయాపహా.
క్రిమి రక్తార్శ శమనీ పవన గ్రంథి శూల జిత్.

సురసాదిగణము. ఉపవిషములలోఁ జేరిన ఓషధి పిత్తహర దూర్వాది గణములోఁ జేరియున్నది. దీని వేరును నమిలిన తరువాత ఇతరవస్తువులు నమిలిన తియ్యగ నుండును. వీర్యవృద్ధికై వేరురసమును అనుభవజ్ఞులు ఇచ్చుచున్నారు. అగదతంత్రముచే గురిగింజ, మంగ, పొత్తిదుంప వీటివేళ్లు విషముగా గలవని తెలియుచున్నది. సుశ్రుతుడు (తత్ర క్లీతక అశ్వమార గుంజా సుగంధ గర్గరక కరఘాట, విద్యుచ్ఛిఖా విజయా నీత్యష్టౌ మూలవిషాణి.) అని మూలవిష విభేదము లగు పేలచి యున్నారు.

ప్రాణమంతయు పంచరసము విషతుల్యముగ నున్నదని ఈ శ్లోకముచే చికిత్సలో విషోపయోగముల నిషేధము జూపి యున్నారు.

శ్లో॥ గుంజాఫలరసః క్షిప్తే వ్రణే నిద్రావినాశనం, తీవ్ర జ్వాల్యంతాం తంద్రాం స్రోతోభ్యో రక్తసంస్రవం. వ్రణే శోథంచ తాపంచ కృత్వా ప్రాణా హరేద్బలాత్.

నిద్రానాశము, ఎక్కువ దప్పలము, తంద్రి స్రోతస్సులనుండి రక్తస్రావ మధికముగలుగ జేసి వ్రణమునందు వాపు (బొబ్బ) గలుగఁజేసి ప్రాణముల హరించుచున్నదని భావము. రెండు తులముల రసమును ఆరు తులముల పాలలో గలిపి దినమున కు ఒక్కతూరి ఇవ్వవలెను. పాలు భోజనము నిచ్చుచుండ వలెను. వారముదినములకు పై నివ్వరాదు. వీర్యవృద్ధియు లేప నాశక్తి గలుగుచున్నది. చిటుబొదివేరుగల్పి త్రాగినవిషముహ రించును.

శ్లో॥ మూలంతు శ్వేత గుంజాయా వక్త్రస్థం విషనాశనం,
పాతా ద్రివేష్ఠితన్మూలం పాశే విషహరం మతం.

గొలిమిడి.

శ్లో॥ క్షురకః శీతలో వృష్యః స్వాదమ్లః పిత్తల స్తథా
తిక్తో వాతామశోధాశ్మతృష్ణా శోథా నిలా స్రజిత్.

నంజు వ్యాధులను హరించుచున్నది. ప్రసూతీ స్త్రీల కొసగు ఔషధములందును జేర్చుటయుగలదు. ప్రసవ సమయములలో లోనున్న దుష్టసారమంతయు వెడలక మకిలను వ్యాధి నేర్ప ఱచుచుండును గాన ఇట్టి ప్రయోగముచే దోషములును వె లిజేయునని జేర్చుచున్నారు. మూత్ర చురుకు వ్యాధుల లో దీని ఆకులు పదితులములున్ను. మాసముఎత్తుమిరియాలు మూసము వెల్లుల్లి పాయలు మెత్తగానూరి అయిదుపూటలు ఇచ్చిన చురుకుహరించుచున్నది. నంజువ్యాధులందు మూత్ర మధికము ఁజేయుచు గుణమునుఁ జూపును. మూడుతులముల రసమువంతున దినమునకు రెండుమార్లు ఇవ్వవలెను. దీనిక్షా రముగూడ నంజులందు గుణకారిగ నున్నది.

చప్పిడి.

శ్లో॥ కటంభరః ప్రమేహాప్ర నాడీ వ్రణ విసర్పమీన్,
హంత్యుష్ణ కఫకుష్ఠఘ్న ........ కఫ ........త్.
నిర్యాసోస్య గురు ర్వృష్యో బలకృ ద్వాతనాశనః.

శ్యామాది రాథ్రాది గణములలోఁ జేరినది. మలబద్ధక వాతములందు అత్యుపకారముఁ జేయుచుండును. కొన్నిపల్లె గ్రామములలో వైద్యసహాయములేని ప్రదేశములలో నున్న ........ కు నోర్వజాలనివారును యీచెట్టుపట్టు రసము ........ ఁగుచున్నారు. గాఢమగు విరేచనము

సామాన్యప్రకృతి(మృదుకోష్ఠము) గలవారికి నాలుగు పర్యా యములు విరేచన మగుచుండును. మలమందు క్రిమి అనగా నలిపురుగులు నట్టలు అను నవి యుత్పత్తియైన సమయముల లో మూడుతులములరసమందు మాసముఎత్తు శొంఠియు మా సముఎత్తు వజయు గలిపి ఇచ్చిన నీళ్ళవిరేచనములు అయిదు ఆరు అగును. క్రిమియంతయు నశించును. విశేషముగ ఒకమూ లికగనే యుపయోగించుచున్నారు గాని అనుభవములో ఇత రఓషధులకు జేర్చి చప్పిడిగ నొసగుటలేదు. చంటిపిల్లలకుమా త్రము ఇవ్వరాదు.

చిత్రమూలము.

శ్లో॥ చిత్రకోగ్ని సమః పాకే కఫశోక సమీరనుత్,
ప్లీహోదరార్శోగ్రహణీ క్రిమికండూవినాశనః.

ఇది వమన, ఆరగ్వధ, వరణా, ముష్క, ముస్తాది గణము లందు జేరుచున్నది. మూలత్వక్కుసారము, క్షారసారముగా గలది. వాతవ్యాధులలో అనేక ఉపయోగముగ నున్నది. కా బట్టియే గణవర్గములలో విశేషముగ కలియుచున్నది. దీనిప్ర ధానము పౌష్కగుణమని ఎల్లఱకును. తెలిసినవిషయమేను జీడి చిత్రమూలము సమానమగు గుణములు గలవని పైశ్లోకా న్వయముచే తెలియుచున్నది. కొందఱు చిత్రకోగ్ని అనినప్పు డు అగ్నిశబ్దమునకు జీడియనియు, అగ్నిస్వభావము గలదనియు

విశేషార్థముల గను బఱచియున్నారు, ఎటులున్నను జీడి చి
త్రమూలములు రెండును అగ్నితో సమాన గుణములుగనున్నవి.
గర్భగ్రంథులలో చల్లలోగాని నూనెలోగాని ప్రయోగించు
చుండుటచే విశేషముగ తాపమును గలుగజేయుచున్నది. చ
ప్పిడి చికిత్సతో ప్రమాదము అనగా గర్భమునంతయు తపింపఁ
జేయుచుండును. వ్యాధిబలముచే రోగి ఓర్చ గలిగియుండునని
యు రోగనివృత్తియగుననియుఁ జెప్పుదురు. కషాయద్రవ్యము
గా నొసంగిన విశేష బాధకరము అగుటలేదు. చప్పిడిచికిత్సలో
నుండు కష్టము లిటుల నుండుటవలన నింద్యమైనదని చెప్పుట
కవకాశతగలదు. కాని ఏక మూలికాప్రయోగము నింద్యమై
నదిగాదనియు దేశకాలభేదము లనుసరించియు రోగి బలాబ
లము లనుసరించి ఔషధ ప్రమాణము నేర్పరుపబడినదని ఆ
యుర్వేదము తెలుపుచున్నది. ఇట్టి చిత్రమూలము అగ్నితో
సమానమగు గుణముగలదని నిషేధించుటలేదు. కాబట్టియే
దీనికషాయము బాలింతలకు వాతదుష్ట స్తన్యదోషము హరిం
చుటకై యేకమూలికగ నుదహరించి యున్నారు.

శ్లో॥ తత్ర వాతాత్మకే స్తన్యే దశమూలం త్రిరాత్రం పిబేత్,
అథవాగ్నిశఠా పాఠా కటుకా కుష్ఠ దీప్యకం, సంభాగీ
దారు సరళ వృశ్చికాళీ - కణూషణం.

ఇందు యేయొకమూలికయైన యోగ్యమగునని తెలియు

చున్నది. మూనెలో నిమటంబలననే తాపము ఎక్కువగుచుండుననవచ్చు. చల్లలోనిచ్చినను గూడ తాగినప్పుడుమాత్రిము కటుదనముండదని యే గాని లోన తనదాహగుణమును మాత్రిము మానుటలేదు. అందుచేత పచ్చికసముకంటె కషాయము నిరపాయకర మగును. పక్షవాయువులు ధనుర్వాయువులు. గ్రంధులు మొదలగు వ్యాధులకు ఒక్కదినమునకు రెండుతులములు రసమువంతున నాలుగుదివసము లోనగి గుణముగానిచో వారము దినములు ఔషధము నిలిపి తిరుగ నాలుగుదివసము లోనగవలెను. అధికముగ నివ్వరాదు.

## చిన్నంగి.

ఇది వాతపైత్య వికారముల బోకడచుచున్నది. విరేచనము జేయించును ఇతర ఓషధులయందు మిళితముగ జేయుచుందురు. ఏకమూలికాప్రయోగములలో విశేషము పైత్యముగ నుండును కాన ఇట్టి మూలికను జేర్చినచో త్వరగ పిత్తోద్రేకమును జేయక శమనము జేయుచుండును. పథ్యము విడుచునప్పుడు పులుసు నివ్వక పూర్వము కొద్ది ప్రమాణముగ పత్రిములను వేయించి పచ్చడిగ నొసగుచు కాలమితముగ పులుసు తినుటయు కలదు. చక్కని విరేచనము, పైత్యహరమునకై దినమునకు నాలుగు తులముల ప్రమాణము.

చిత్రీకూర.

శ్లో॥ తండులీయం హిమం రూక్షం రక్తపిత్తాతిసారనుత్,
హంతి శ్వాసం త్రిదోషంచ విషం స్థావరజంగమం.
దీపనం సన్నిపాతఘ్నం జ్వరాతిసారనాశనం.

సురసాదిగణములలో జేరినది. దేశీయములందు చెలిమిటికూర యనుచుందురు, రసౌషధములు ఇచ్చినపుడు నోరు పట్టు బట్టుటకు, పండ్లు కదులుచుండుటకు గూడ నుపయోగించవచ్చును. అనుభవజ్ఞులు అతిశయముగ గరవిషములం దుపయోగించుటయు కలదు. అందుస్త్రీలు, పురుషులకుగాని పురుషులు స్త్రీలకుగాని వశీకరణార్థమై ఔషధములొసంగినప్పుడు ఔషధములు జీర్ణించక యుండునని వమనము జేయించుచుందురు. అట్టి వమనమున నాభిస్థానమందు మూర్ఛగలుగజేసి రోగి క్షీణించుచుండును. ఈ గరవమనపుమూర్ఛనకు యీ మూలికాచికిత్స గుణకారియై యున్నది. మరియు వమనముచే గలిగిన శ్వాస క్షయాముల హరించుచున్నది. ఈ చికిత్సాపద్ధతి అగదములో ఈ రెండువిధములుగ గాన్పించుచున్నది.

శ్లో॥ గృహధూమం మేఘనాద మూలం నీరేణ పేషయేత్,
లిప్త్వా చ్చతురణాం చాద్యం ఘృతక్షీరం చతుర్గుణం.
ఘృతశేషం పిబేత్సర్వం శమయేత్ కృత్రిమం విషం॥
దీనిప్రమాణము పలాటకు మూడుతులములు వంతువ

సమూలాలరసమును, 15 తులములపాలును జేర్చి ఇవ్వవలయును దినమునకు ఒక్కసారివంతున నాలుగు లేక అయిదు దినములవరకు ఇవ్వవచ్చును.

చెంజర్లగడ్డ.

శ్లో॥ లాంగలీ కటుతిక్తోష్ణా శోఫార్శో వ్రణ శూల జిత్,
కష్ఠ కుష్ఠోదరం హంతి పిత్తలా గర్భపాతినీ.

కుష్ఠు వ్యాధుల హరించుచున్నది. అత్యుష్ణముచే గర్భ స్త్రీలకు నింద్యమైనది. ఎక్కువ ప్రమాణముచే వాంతి భ్రాంతి గలిగి ప్రమాదములు చేకూర్చుచుండును. సవాయి వ్యాధులందు శరీరమందు పొడలు జనించినను అందుండి చెడ్డ నీరు స్రవించుచున్నను దీని యుపయోగముచే గుణమగు పడుచుచున్నది. పొడలు హరించుటకు పూటకు ఒక గురిగింజ ప్రమాణమువంతున మండలము (౪౦) రోజులు సేవించవలెను.

శ్లో॥ జలేన లాంగిలీకందో నస్యాత్సర్వవిషాపహః॥

కుష్ఠువ్యాధులలో వయోబలము లనుసరించి ఒకటిన్నర గింజవరకు దుగ్ధతను గమనించి ఇవ్వవలయును. దీనిని నీటితో గంధముతీసి నస్యముజేయించిన సర్పవిషము హరించును.

చేగొండ.

శ్లో॥ క్షీరఘోరటా కటుకా తిక్తా చోష్ణాచ శీతలా,
రసాయనీ సరాలక్ష్మీ కషాయా కఫపిత్తనుత్.

శూలజ్వర కృమిగ్రంధిమూత్రకృచ్ఛ్ర ప్రమేహాహ్వాత్,
ఆనాహోదర హృద్రోగ విషపాండు భగంధరాన్,
హస్తాని నాశయే దేవం పూర్వవైద్యై ర్నిరూపితం ॥

వీరతరాది గణములోఁ జేరిన ఓషధి. చేకొణి నైఘంటికనామము. ఏకమూలికాప్రయోగము చేయు ప్రతివారికిని ఈ ఓషధి పరిచితిగలిగియే యున్నది. కొందఱు కొన్నిప్రదేశములలో నశించకుండ ఓషధిని జాగరూకతతో పెంచుచునుందురు. అశీతివాత వ్యాధులలో నుపయోగించవచ్చును ఇందు మరికొన్ని ఓషధులు గలుపవచ్చును. గాని ఏకమూలికచే త్వరగ గుణమగుపరచునట్లు గుణము నిచ్చుటలేదు. ఈఓషధికి విశేషముగ స్నేహావర్గముకంటె శత్రువర్గమే గలిగియున్నది. అందు వెణుతురు చెట్టు ప్రత్యక్షమగు శత్రువు, ఈ రెంటిని కలుపుటచే దుగ్ధతను తొలగించక స్థిరత్వమును జేయుచున్నవి. ఈ చెప్పిడి చికిత్సలన్నిటికిని సూర్యరశ్మి విశేషవాయువును శీతలమును నిషిద్ధములై యున్నవి. ఇందు కొన్ని మాత్రము సూర్యరశ్మికి నిషేధముగాక యుండును. ఈ ఓషధీప్రయోగములో ఎట్టి అపథ్యాదులు జరిగినను వెంటనే తొలుత దుగ్ధతను తీసివేయక పోవుటయే గాక విరుద్ధవ్యాధు లనేకములును దూషీకృత వ్యాధులను బుట్టించుచుండును. అందుచేతనే ఆయుర్వేదజ్ఞులు దూషీకృత నిదానము.

జనిత వ్యాధులఁ జూపియున్నారు.

శ్లో॥ దూషితం దేశకాలాన్న దివా స్వప్నై రభీక్ష్ణశః,
యస్మా ద్దూషయతే ధాతూ న్తతో దూషీవిషం
స్మృతం॥

దేశకాల ఆహార, విహార, నిద్రాదులచేతనున్ను నియమితో ధర్మవిరుద్ధ క్రియలచేతనున్ను దోషములు రసాదిధాతువుల చెరచుచు.

శ్లో॥ జ్వరే దాహాచ హిక్కాయాం మానాహే శుక్ర
సంక్షయే, శోథాతిసారే మూర్ఛాయాం హృద్రోగే
జఠరే పిచ. ఉన్మాదే వేపథౌచైవ యేచాన్యే
స్యు రుపద్రవాః॥ యథాస్వం తేషు కుర్వీత విషఘ్నై
రౌషధైః క్రియాం॥

జ్వరము, తాపము, ఎక్కిళ్లు, కడుపు ఉబ్బరం శుక్రనాశము నంజు, అతిసారము మూర్ఛ హృద్రోగము ఉదరము వృద్ధి, పిచ్చి, వణుకు గలిగించుచుండును. (అనేక వ్యాధులు జనించినను విశేషము పక్షవాతముకు నంజు అతిసారము గలుగును.) ఈ చికిత్సావ్యాధులకు మలమూత్రములను నిరోధింపఁగూడదు. కాలపరిస్థితిని ప్రతిదినమును వెలువడునట్లు చికిత్సించవలెను. వ్యాధి ప్రకోపములో పూటకు మూడు తులముల మూత్రక్షారసము నివ్వవలెను. దినమునకు ఒక్క-

సారిమాత్రమే ఇచ్చుచుండవలెను. వ్యాధినిలిచియున్నప్పుడు గాని శమనావస్థయందుగాని ఒకటిన్నరతులము మాత్రమే యొసఁగవలెను.

జమ్మి.

శ్లో॥ శమీ శీతా గురుస్స్వాదు రూక్షోష్ణా కేశనాశినీ,
విసర్ప వ్రణ దద్రుఘ్నీ ప్రదరం హంతి శీలినః॥

ఇది మేహవ్యాధులను, ప్రదర, కామిలా, వ్యాధులను పోఁగొడుచు. ధనిష్ఠానక్షత్ర మూలికగాఁబట్టి ఈ నక్షత్రమందు వచ్చు వ్యాధులకును జన్మనక్షత్రము గలవారికిని ఎక్కువ ఉపయోగమై యున్నది. కామిలావ్యాధికి దీనిచిగురుటాకుల ఒక్కతులము మాసముఎత్తు మిరియాలు నూరి దినమునకు రెండుపర్యాయముల వంతున వారమురోజులు ఇవ్వవలెను. మేహ ప్రదర వ్యాధులలో ఆరుతులముల రసమునుండి ౧౦ తులములరసమువరకు ఇవ్వవలెను. అయిదు లేక ఏడు రోజుల వరకు నివ్వవలెను. మధురాహారము లిచ్చుచు ఎక్కువ దినములుగూడ చికిత్సించ వచ్చును.

జీడి.

శ్లో॥ భల్లాతః కటు తిక్తోష్ణ నుదరక్రిమి శూలజిత్,
గుల్మార్శో గ్రహణీ కుష్ఠం హంతి వాత కఫామయాన్
ఏభి ర్గోమూత్రసంయుక్తం కటుతైలం విపాచయేత్,

పామా విచర్చికా దద్రుకండూ కుష్ఠ క్రిమివ్రణాన్
అభ్యంగా న్నాశయ త్యేవ తథా నిద్రావణాం మతం.

ముస్తాదిగణములోఁ జేరి బీజ క్షీర సారములు గలది. ఇది ఉపవిషములలో జేరినది గనుక ప్రమాదముల గూర్చునని తంత్రజ్ఞులు జెప్పియున్నారు. అయినను గింజ, అందుండుచర్మము, మాంసమునకు శరీరమునకు పుష్టిని గలుగ జేయుచున్నదని అష్టాంగ హృదయములో నున్నది.

శ్లో॥ భల్లాతకస్య త్వ జ్మాంసం బృంహణం స్వాదు శీతలం,
తదస్థ్యగ్ని సమం మేధ్యం కఫవాత హరం పరమ్॥

మధురముగ శీతలముగ నుండును. జీడివిత్తులు నిప్పువలె బహుతీక్ష్ణముగ స్ఫోటకములు గలుగ జేయును గాన అగ్ని సమాన మగుచున్నది. కఫవాతములను బోగొట్టును. మరియు ఉపవిష గుణముండు.

శ్లో॥ భుక్తే భల్లాతకే కుర్యా త్సంతాపం రక్త వేగతాం,
క్షిప్తం తైలం తనౌశోథం విష్లుష్టం కాలచిహ్నకం,
తత్రత త్రైవ విస్ఫోటో యత్రతస్య రసో పతేత్.

దీని తైలరసము శరీరముపై పడినచో స్ఫోటకము మాదిరి పొక్కుననియు ఆస్ఫోటకము చితికినరసము ఎచ్చటపడినను అస్థలమంతయు బొబ్బలగుననియు జెప్పియున్నారు. మూలికను మాత్రము క్రిమివ్యాధులలో దుష్టవ్రణములుకు నని సమ

తుములలో మూలత్వగ్గసము ఒకదినమునకు మూడుతులములు ఇంతున మూడుదినములు ఇవ్వవచ్చును. మేహవాత చురుకు వ్యాధులలో అరటిపండులో మధ్య గుంట జేసి అందు మూడు చుక్కలు మాత్రమే జీడినూనెవేసి గుంటపై పండుపొడిగి మ్రింగినచో వెంటనే మూత్రబాధ తగ్గును. బాలురకు పాలతో మూడు చుక్కల నూనెవేసి ఇచ్చిన శ్లేష్మదగ్గులు హరించును. నొప్పులున్న స్థలములలో దీనినూనెను చుక్కగా నిడిన నొప్పులు తగ్గును. గాని చాలామందికి జీడితగిలినంతనే శరీరమంతయు పొంగి వేదనగలుగును. గాన అభ్యాసమున్న వారికి మాత్రమే యొసంగవలయును.

తంగెడు.

శ్లో॥ ఆవరాల్ తిక్తాకా శీతా చక్షుష్యా పిత్త దాహానుత్,
మూఖరు కృష్ఠ జంతూనాం నాశినీ చాతిసారహా.
శోధం శూలం వ్రణం జూర్తిం నాశయే దితి కీర్తితా॥

వత్రిసారముగాగలది. అతిసారములో దీని చిగురుటాకులను ఒక్కతులము పెరుగుతో నూరి పెరుగుజేర్చి మూడు పూటలు ఇచ్చిన ఘోరాతిసారములు గూడా నెమ్మదియగును. మూత్రబాధయందు మూలత్వక్కు (వేరుచెక్క) రసము మూడుతులములున్ను, ఒక్కమాసము ఎత్తు శర్కరను జేర్చి మూడు లేక అయిదు పూటలు ఇచ్చిన మూత్రబాధలన్నియు

హరించును. ఈ చెట్టుమీద నొకపురుగు గూడుపెట్టుచుండు ను. ఇది ఒక అంగుళము పొడవుగలిగి సన్నని పొడుగుగలిగిన పుల్లలతోఁ జేయఁబడి యుండును. ఇట్టి పురుగుగూళ్లు అనేక వృక్షములమీద నున్నను తంగేడుచెట్టు మీదిదిమాత్రమే మంత్రజ్ఞులు విశేషముగ నుపయోగించుదురు. అమావాస్య ఆదివారముకంటె గ్రహణములందు ధూపదీప నివేదనలొసఁగి గ్రహించినదే శ్రేష్ఠముగనుండును. లోహాదులచేఁ జేసిన తాయెత్తులకంటె ఇది గుణకారియని పొగడుచుందురు. పై పథ్యమందు పాలుగాని చల్లగాని ఇవ్వవచ్చును. ఒకదినమందు మాత్రము రెండును నివ్వక ఒకటిమాత్రమే ఇవ్వవలయును.

తుమ్మి.

శ్లో॥ ద్రోణపుష్పీ రుచికరా కట్వీ చోష్ణాచ భేదికా,
పథ్యా స్వాదుహరా గుర్వీ క్షారరసామతా॥
వాత పిత్త కరా వాత కఫనాశకరీ మతా।వాతం చై
వాగ్ని మాద్యంచ కఫం చామంచ శోధకం।
కామిలాం తమకశ్వాసం క్రిమీన్ శూలంచ నాశ
యేత్॥ పర్ణం త్వస్యా స్వాదురూక్షం పిత్తలంచ
గురుస్మృతం। భేదకం కటుశోఫంచ నాశయే దితికీర్తితా॥

ఆహ్నికజ్వరములలోనున్ను, వరుస జ్వరములలో నున్ను దీని పూలుమూడు తమలపాకులో బెట్టి ఇచ్చిన మానుచున్న

వి. దోషాదులు ఎక్కువగ నుండనిచో పూలతోనే జ్వరములు నివర్తించుచున్నవి. దోషము లధికముగనున్న దీనివేరు రసమును మూడుతులము లిచ్చిన జ్వరములు తగ్గుచున్నవి. దినమునకు మూడుతులముల ఖంతున మూడు, లేక అయిదు దినములవరకు ఇవ్వవలెను. దీని ఆకు మిరియాలు సమముగ గ్రహించి తీసిన రసమును పాము గఱచిన వెంటనే 5–6 చుక్కలు కండ్లలో నిడిన సర్పవిషము హరించుచున్నది. పావుఘంటలో విషముహరించనిచో తిరుగ రెండవసారి నేత్రములందు పైవిధముగనే బిందువులుపడవలిన ఎట్టివిషమైనను హరించును. సురసాదిగణములో జేరినది.

## తెల్లపడపత్రము.

వాతహరమైనట్టిది. రక్తముచే గాని! చీముతో గాని గడ్డలు గలిగి పగులని బాధలందు దీని ఆకులను వెచ్చజేసి కట్టినచో అందుండు మాలిన్యమును వెలిజేసి వ్రణమును మాన్పచుండును. ధనుర్వాయువులలో దీనిపత్రిరసము పదితులములున్న మిరియాలు మాసముయెత్తు, మోడి మాసముయెత్తు కలిపి ఇచ్చిన గుణమును జూపుచున్నది. ఇందుపథ్యము కొఱ్ఱలతో జేసిన జావను ఇవ్వవలెను. గడ్డలందు దీని ఆకును వేయునప్పుడు, ఆకును వెల్లికల వేసిన గడ్డ వృద్ధియై పగులుటయు బోర్ల వేసిన లోభాగమునను కరుగుటయుం దటస్థించుచున్నది.

ప్రాణమండలి చేష్టప్రాప్తిపమంతయు శరీరపు లోభాగములో
ఇముడుట కంటెబహిలి వెలివడుటచే ఇతర వ్యాధులు కలుగకుం
డును. వాతవ్యాధులలో దినమునకు ఒక్కసారి వంతున
మూడుదినముల వరకు ఔషధము సేవించవలెను. ముప్పథ్య
ము నాచరించవలెను.

తెల్లములక.

శ్లో॥ తద్వత్ప్రోక్తా సితాక్షువాస్త్రి విశేషాద్గర్భకారిణీ,
రుచ్యా చాంజనయోగేన నానా నేత్రామయాపహా.

విద్యారాది, వరుణాది గణములందు జేరినది. ఈమూలిక
దొరకుట అరుదై యున్నది. గాని ఇందు భేదములోఁ జేరిన
వాకుడును ఇచ్చుటయు గలదు. రెంటియందు కాసవ్యాధుల
బోకడచు శక్తి యున్నను వాకుడంచు మాత్రము గర్భవతులకు
శక్తి లేదు. మరియు వాతప్రకృతి గలవారలకు ఓషధినుండి
తీసిన పచ్చిరసమును పిత్తప్రకృతి గలవారలకు శిలలచే తపిం
పఁజేసిన రసమును పూటకు పదితులములవంతున ఇవ్వవల
యును. పథ్యమునందు వాతప్రకృతిగలవారలకు ఉష్ణముగను
పిత్తప్రకృతి గలవారలకు మధురము (క్షీరము) లతో నున్న
పథ్యము చేయించవలెను. అయిదు సంవత్సరములవరకు ఇట్టి
చికిత్సచే నిశ్శేషముగ కాసవ్యాధులు హరించును. ప్రతిసం
వత్సరమున్న వారమురోజులవరకు ఔషధసేవన జేయవలెను.

హూ లి కా యో గ ము.

తు త్తు రు బెం డ.

దీనిని అంటువ్యాధులలో నుపయోగించిన గుణవంత ముగ నుండును మేహ సవాయి చురుకు గనేరియా మూత్రకృచ్ఛ్ర వ్యాధులందు దీని మూలరసము పదితులములున్ను జీలకర్ర శర్కర ఒక్కొక తులమున్ను గలిపి ఒక్కదినమునకు ఒక్కసారిచొ ఇవ్వవలెను. ఇట్లు మూడుదినములు ఇచ్చిన నిశ్శేషముగ మఱికొందఱికి తాత్కాలికముగ గుణమగుపఱచును. స్త్రీ సంగమాదులలో గలుగు దోషగుణములకు అద్భుత గుణకారియైయున్నది.

ద ం తి.

శ్లో॥ దంతీ తిక్తోష్ణకటుకా కఫవాతోదరాపహా,
అర్శో వ్రణాశ్మరీశూలం హంతి దీపన శోధనీ.

దీని పట్ట వమనకారి. గర్భ గ్రంధులు హరించును. విరేచనము లతిశయించును. గడ్డలు హరించుటకు దీని ఆకులు ఒక్కతులము మెంతులు ఒక్కతులము నూరి పట్టిగ వేసిన పగిలి బాధతొలగును. లో గ్రంథులకు మూలరసమును రెండుతులములు ఆరుతులముల పాలలో గలిపి ఒకదినమునకు ఇవ్వవలెను. రోజుకు ఒక సారి వంతున మూడుదినములు ఇవ్వవలెను.

శ్లో॥ కపి కచ్ఛూ రసే స్వాదు రక్త పిత్తా నిలాపహా,
వృష్యా పిత్తాస్రి హాంతీ్రిచ దుష్ట వ్రణ వినాశినీ.

పిత్త హరగణములో జేరిన ఓషధి. దీనిగింజలను పాలలో నుడికించి తీసి ఎండించి చూర్ణించి ఒక్కఅరతులము వంతున ఉదయము సాయంకాలము పాలలో ఇచ్చిన వీర్యవృద్ధికర మగును. యిరువది దినములు యిచ్చినచో ఎట్టి బలహీనుడై నను దార్ఢ్యతగలిగి ఆరోగ్యవంతుఁడగును.

దురదకంద.

శ్లో॥ దీపనో సూరణో రుచ్యః కఫఘ్నో విశదోలఘుః
విశేషాదర్శ సాంపద్యః.

ఇది విశేషము అడవులందు దొరుకును. అర్శోవ్యాధుల హరించును. దీని సేవనచే గళమంతయు దురదగలిగి యుండు ను. దీనినిమెత్తగాదంచి వెన్నయందుబెట్టి ఉసిరిక కాయ ప్రమా ణము ఒక్కపూటకు యివ్వవలెను. ఉదయ సాయంత్రిములు ఇచ్చుచుండవలెను.

కొందఱికి నలుబది రోజులవరకు నిశ్శేషమగుచున్నది. వెన్న పొదిగి మింగినచో ఎక్కువ దురదగలుగకుండును. సుకు మారులు ఓర్వజాలనిచో మధ్యమధ్య నిలిపినను కఠినపథ్యము లాచరించుచు తిరుగ ఔషధమును సేవించుచుండవచ్చును.

దుష్టపచెట్టు.

శ్లో॥ కుటుంబినీ తు మధురా గ్రాహికాచ రసాయనీ,
శీతలాచ వ్రణం పిత్తం కఫం రక్తం రుజంతథా.
క్రిమించ కండూ శోషంచ కుష్ఠం చైవ వినాశయేత్॥

వల్లీ పంచమూలములోనున్న, వీరతరాది గణములోనున్న జేరిన ఓషధి. విజాంశాస్త్రమందు గుటగుటా కనుచుందురు. పసి పిల్లలకు వచ్చు శ్లేష్మ వాత వ్యాధులలో విశేషముగ నుపయోగకరమైయున్నది. మలమూత్ర ప్రతిబంధకములున్నప్పుడు శీఘ్రముగ మలపక్వములఁ జేయుచుండును. ఉబ్బసము, దగ్గు, హరించుటకు అరతులము రసము వెచ్చజేసి యిచ్చిన హరించును. మరియు దీని వేరురసము సెగ వ్యాధులలో అతీతముగ గుణమును జూపును. వేరునుండి తీసిన రసము పది తులములున్ను సున్నపుమీది తేటనీరు పదితులములున్ను కలిపి అంటువ్యాధులకు నిచ్చిన హరించును. దీని వేరు పావుతులము జిల్లేడు వేరు పావుతులమ్ము సన్నావాలు పావుతులము గలిపి యిచ్చిన సర్పవిషము హరించును.

దూసరితీగె.

ఈ రాష్ట్రమందు దీనిని సిబ్బితీగె యనుచుందురు. దీని ఫలమును మూత్రపు మంటలలో పటికబెల్లము (మిశ్రి) లేక శక్కెర జేర్చి ఇచ్చుచుందురు.

మఱికొందఱు కత్తిచేగాని గొడ్డండ్రచే గాని గాయములు తగిలిన వెంటవే దీని సత్వమును అనగా ఆకును కొద్ది నీరులో వేసి కవ్వముతో చిలికినచో ఆకుపలిగి దానినుండి అడుగున గట్టిదనముగ పేరుకొనుచుండును. ఇట్టి సత్వమును ఆలస్యము జేయక వెంటనే కాటునందు వైచి, గాలి లోభాగమున ప్రవేశించకుండునట్లు బట్టచే గట్టిన రెండుదినముల కంతయు తెగియున్న రెండుఅంచులు కుట్టినట్లు గట్టిగ అతికి యుండును.

దొండ.

శ్లో॥ వమనీ కఫ పిత్తాస్రి శోఫ పాండు క్షయాపహా,
తస్యాః ఫలం గురుస్తన్యం శ్వాస కాస సమీరనుత్.

ఇది వమన వరుణ, అర్కాది గణములలోఁ జేరినది. ఇందు ఆదొండ, పాముదొండ, లింగదొండ, తియ్యదొండ, అని భేదములున్నవి. మొదటిది సంతానముగాని వారలకు రోజు ఒక్కొంటికి పదితులముల రసమును పదితులముల న్నూనె లో గల్పి రెండుమార్లు ఇవ్వవలెను. పాముదొండ సర్వవిష ముల వాంతి జేయుటకు అయిదుతులముల రసము నోసంగ వలెను. లింగదొండ మంత్రినేత్తలు స్వప్నగ్రహ బాధలకు ఆదివారమందు గ్రహించి మంత్రించి రక్షణకొరకై వేరును ఇచ్చుచుందురు. తియ్యదొండ చనుబాల వృద్ధికై రసము నాలుగు తులములును వెల్లుల్లిపాయలు ఒక్కతులమును గలిపి

ఇవ్వవలెను. కొందరి ప్రకృతులకు ఈ రసము వాంతియగుచున్నది. గాన మొదట ఆకును నీరుబోసి ఉడికించి నీరు వంపివేసి ఆకునందు ఉల్లిపాయలు వైచి కూరగా వండి ఇవ్వవలెను. దీని గడ్డరసము మేహవ్యాధులందు గనేరియా వ్యాధులందు పదితులములు నిచ్చిన గుణమును జూపును.

ఆగాకరదుంప అరతులము కాకిదొండ అరతులము సన్నాకు అరతులము గలిపి ఇచ్చిన సర్పవిషములు హరించును.

## నక్కెర.

శ్లో॥ క్షుదఘ్నీ శ్లేష్మాంతకం వాత కోపనం మధురం మతమ్,
కించిచ్ఛ శీతలం జ్ఞేయం కృమిఘ్నం స్వర్ణమారకమ్.

మాల్కాంగినీ యని ఇచ్చట వైద్యులు పిలుచుచున్నారు. దీని ఆకులు నూరి వెన్నలో నిచ్చిన ఎట్టి సంజువ్యాధులైనను హరించును. మరియు అంటువ్యాధులలో దీనితో సమానగుణము నేవియును జూపఁజాలవు. దీనితో దొండగడ్డను జేర్చిన చో మేహ వ్యాధులు, గనేరియా, ఎంతకాలము నుండి యున్నను హరించును. దినమునకు పదితులముల రసము వంతున మూడుదినములు ఇవ్వవలెను. ఇది విషహరయోగములో జేరుచున్నది.

## నల్లేంగి.

అత్యుష్ణముచే గలుగు పగరుపు గల దగ్గువ్యాధులను

హరించుచున్నది. కొందఱి ప్రకృతులకు సూక్ష్మమగు శీతల
ముగాని లేక కొంచ మధికమగు ఉష్ణమును గాని ఓర్చని
వారికి ఎక్కువ గుణమునుఁ జూపుచున్నది. పిత్తశ్లేష్మముతో
గూడినప్పుడు నల్లతీగెను గాని వాకుడును గాని సమానముగ
జేర్చి ఇవ్వవలెను. పూటకు పదితులముల రసము ప్రమాణ
ముగ నుండును. విరేచనము లేనిచో విరేచనముఁ జేయుటకై
ఇతరములు గలుపవలెను. మూడు దినములు మాత్రమే ఇవ్వ
వలయును.

## నల్లదీగె.

శ్లో॥ కృష్ణాతాంబూలవల్లీతు తిక్తోష్ణా కటుకా మతా,
కషాయాచ మలస్తంభకారిణీ దాహకారిణీ.
ముఖ జాడ్య కరా ప్రోక్తా మునిభి స్తత్వదర్శిభిః॥

సూతికా సంబంధమగు వాతశ్లేష్మ దగ్గులను హరించును.
శ్లేష్మజ్వరమున్నప్పుడు బాలింతలకు దీని నిజరసము మూడు
తులముల వంతున మూడుదినములు ఇవ్వవలెను.

## నెమలివార.

ఇది చిత్రమూలముతో సమానమగు ఉష్ణముగలిగి
త్వరగా పుండుజేయునట్టి గుణముగలది. ఇది శరీరమువిూద
ఒకక్షణకాలము నుంచిన మంటలుగలిగి చర్మము కమిలియుండు
ను. వాతవ్యాధులందు తప్ప ఇతరత్రి ఎన్నటను ఏకమూలికగ

నుపయోగించరు. మేహవాత కలుకలయందు దీని రసము ఒక్కతులమున్ను ఇతర ఓషధులరసము పదితులములున్ను గలిపి నను తన స్వాభావికమగు తీక్ష్ణగుణమును కొంతవరకు జూపుచునే యుండును. వృద్ధవైద్యులు అనగా డెబ్బదిసంవత్సరముల పై వారు ఈఓషధీప్రయోగ మొప్పుటలేదు. కారణ మాలోచించ వీరికంటె ముందు వా రుపయోగించ నందున వీరికి అనుభవము లేకున్నది. ఇందుచేత ఈ మాలికాప్రయోగములో రెండుతెగలుగ నున్నారు. ఇరుతెగలవారును పశువ్యాధులకు వచ్చు దొమ్మవ్యాధులందు మాత్ర ముపయోగించుచున్నారు. మనుష్యులకు నుపయోగించుట ఈలోపటివారే ని పెట్టియున్నారని తెలియుచున్నది. నొప్పులు తగిలి రక్తము పేరియుండినప్పుడు దీనితో ఈక్రిందివిధముగ లేపనఁజేయుట గలదు. దీనిరసము పదితులములు మినుపపిండి పదితులములు నూనె పదితులములు గలిపి కాచి, పైరసము నూనెలో ఇనుకునట్లు వంటజేయవలెను. కొందఱికి నొప్పిఉన్నంతవరకును మరికొందరికి నొప్పిఉన్నను మంటగానుండును.

సేల ఉసిరి.

శ్లో॥ తమాలికా రసే తిక్తా వీర్యేచ శిశిరా మతా,
పిత్తం హంతి కఫాస్రఘ్నీ వస్తి దాహ వినాశినీ.
శ్లేష్మదోషహరా రుచ్యా విశదా సురభిర్లఘుః॥

ఇది మేహ సంబంధమగు వ్యాధులలో గుణమునుఁ జూపుచున్నది. దీర్ఘ సేవనచే అంటువ్యాధుల నతిసారముల హరించును. మూత్రకృచ్ఛ్రములో స్వల్పకాలములోనె గుణ మగుపడుచును. మూత్రాన్యాసాధిక్యతలలో సమూలరసము అయిదు తులములు, పాలు ఆఱుదుతులములు గలిపి యివ్వవలెను. దీర్ఘ సేవనయందు దినమునకు రెండుతులముల రసము కంటె ఎక్కువ గాని ఇవ్వరాదు. చప్పిడివిధానము మూడు దినములున్ను, దీర్ఘ సేవనయందు మధుర ఆహార పథ్యాదులును యివ్వవలెను.

## నులిదడ.

శ్లో॥ మహాజాలినికా తిక్తారేచనీ కఫపిత్తజిత్,
హన్తి దాహోదరానాహ శోఫ కుష్ఠ కృమి జ్వరాన్॥

శిరోభారమందును. పార్శ్వపునొప్పులకు దీని కాయలు తీసుకుని వచ్చి చెవులకు గట్టిన నెత్తినొప్పి తగ్గును. ఒకదిన మంతయు నుంచినచో మరుసటిదినము పార్శ్వపునొప్పి రాక యున్న వదలివేయవలెను. విశేషముగ కడుపులో నులిపురుగు లున్నచో దీని మూలరసము దినమునకు పెద్దలకు రెండుతుల ముల రసమున్ను చిన్నల కరతులము రసమును రెండుదినము లు యిచ్చిన హరించుచున్నది.

## నీరుగొబ్బి.

శ్లో॥ క్షురకః శీతలో వృష్యః స్వాదమ్లః పిత్తల స్తథా,
తిక్తో వాతామ శోథాశ్మ తృష్ణా దృష్టా నిలాస్రజిత్.

నంజువ్యాధులలో గుణకారి. శ్లేష్మగత నీరును, మలమును వెలిబుచ్చుచు హృదయమునకు బలమును గలిగించుచుండును. దీని గింజలను పాలలో ఉడికించి తీసినట్టివానిని చూర్ణించి ఒక్కతులము చూర్ణమును పదితులముల పాలలో త్రాగిన వీర్యస్తంభనయగును. నంజువ్యాధులలో దినమునకు అయిదు తులముల మూలత్వక్కురసము వంతున వారముదినములు యివ్వవలెను. ముప్పత్యము జేయుటయేగాక మూడుమాసముల వరకు అపథ్యాదులు చేయరాదు. మూలసారము క్షారసారముగా గలది యగుటచేతనే మూలత్వక్కును గ్రహించుచున్నారు.

## పమిడిపత్తి.

బీజసారములో జేరిన ఓషధి. రక్తమధికముగ స్రవించుచున్నప్పుడు దీని చికిత్సచే నిలుపుదల చేయవచ్చును. స్త్రీల ఋతుస్రావమును సరియగు మార్గమునకు తెచ్చును. ముక్కు [illegible] రక్తము పదేపదే పడుట యిట్టివారలకు పూటకు [illegible] తులముల వంతున మూడురోజులు మూల రసమును యివ్వవలెను. నాసికారోగము దీర్ఘముగనున్నచో

పూటకు ఒక్కతులము రసమువంతున వారమురోజులు ఇవ్వ వలెను.

ప ర్లే రు.

శ్లో॥ శ్వదంష్ట్రో బృహణో వృష్యో త్రిదోష శమనోగ్ని కృత్, శూలహృద్రోగ కృచ్ఛ్రఘ్నః ప్రమేహాది నివర్తకః॥

ఇది హ్రస్వ పంచమూలములో జేరిన ఓషధియు మరియు బృంహణ వస్తికి నుపయోగముగ నున్నది. మూత్రవ్యాధుల లో బింధువులుగ మూత్రమువచ్చుట లేక మూత్రపూర్వము గాని మూత్రానంతరముగాని గలుగు శుక్లనష్టమును నిలుపు దల జేయును. పూటకు అయిదుతులముల రసమువంతున వారమురోజులు ఇవ్వవలెను.

ప సు లో ని పం చా ర.

దీనిని అహిక జ్వరములలో విశేషముగ వాడుటగలదు విశేష ఇతర యోగములలోనున్ను జేరుచుండును. జ్వరములలో పూటకు రెండుతులములు వంతున వారమురోజులు ఇవ్వవలెను.

శా ల కొ డి శ.

శ్లో॥ ఐంద్రో యవ స్త్రిదోషఘ్న స్సంగ్రాహీ శీతలఃకటుః, జ్వరాతిసార రక్తార్శః కృమి వీసర్ప కుష్ఠనుత్.

శ్లో॥ కుటజః కటుక స్తిక్తః కషాయేణచ శీతలః,
పిత్తాస్రి తృష్ణాతిసార గుదకీలాన్ వినాశయేత్.

ఇది క్షార షట్కములో జేరినది. నిరూహ గణమందును ఆరగ్వధాది గణమందు వచాదిగణమందును జేరియున్నది. దోషహరవస్తికి యోగ్యమైనది. అతిసారము, దగ్గు, జ్వరములు హరించుచున్నది. విరేచనములు గట్టుచున్నను కొన్ని వ్యాధులలో విరేచనముం జేయుచునే యున్నది. అతిసారములలో చెక్కరసము పూటకు ఒక్కతులము వంతున మూడు పూటలు ఇవ్వవలెను. చలిజ్వరములలో అయిదు పూటలు వెచ్చజేసిన రసము పై మాదిరి ఇచ్చిన కుదుర్చును. జ్వరములలో శొంఠి, పిప్పలి, మిరియాలు ఇత్యాదులు కలుపుటయు గలదు. కావవ్యాధులలో అతిసారములలో ఇచ్చు ప్రమాణముకంటె అర్ధతులమునుండి ఒక్కతులమువరకు రోగి బలాబలముల నెఱిఁగి హెచ్చింపజేయవచ్చును. గట్టిదనము (పిచ్ఛిలత్వము) గలిగిన శ్లేష్మమును కరిగించి విరేచనరూపముగ వెడలించును. సమయము లనుసరించి దినమునకు రెండుసార్లు పయోగించ వచ్చును.

## పాలబొట్ల.

రక్తశోధనకారి, రక్తప్రదరములలో గుణముసుఁ జూపును. ఎట్టిప్రకోపావస్థలలోనున్నను రక్తప్రదరమును, ఋతు

స్రావమును ఇట్టిచికిత్సచే నిలుపవచ్చును. అయిదుతులముల రసమున్ను పదితులముల పాలున్ను గలిపి దినమునకు ఒకసారి యే ఇవ్వవలెను. మూడుదినములవరకు యివ్వవచ్చును.

## పొద్దుతిరుగుడు.

శ్లో॥ ఆదిత్యభక్తకటుకా తద్గోష్ణా స్ఫోటకా పహా,
శ్వాస కాస హారా జ్ఞేయా రసాయన వరా చ సా॥

ఇది వీరతరాది గణములో జేరినది. మూలసారముగాం గలది. ఈ ఓషధి చక్షురింద్రియజ్ఞానము గలిగి యున్నది. సూర్యుడు ప్రకాశమగు కొలది దీని పూవు వికసించుచు సూర్యచలనకు ఎదురుగనుండును. అస్తమాన మప్పుడును సూర్యునకభిముఖమై యుండుటచేత శాపవశమున మూలికగఁ బుట్టవలసి వచ్చినదనియు ఇట్టి శాపవిముక్తి యగుటకు సూర్యోపాస్తి జేయుచుండు ననియు జెప్పుచుందురు. ఇందు ఆరోగ్య శాస్త్రమున శాపములను విషయమున్నదని అందుకు చికిత్స భగవత్ప్రార్థన యనియు జెప్పియున్నారు. కాని ఇచ్చటమాత్ర ము శాపమనుటకంటె ద్రవ్యములన్నియు చేతనాచేతనములని ద్వివిధంబులనియు అందు వృక్షములన్నియు ఇంద్రియజ్ఞానము గలిగిన వగుటచే చేతనములనియు సూత్రకారులు నిరూపించి యున్నారు. ఎటులన

శ్లో॥ ఖాదిన్యాత్మా మనః కాలో దిశశ్చ ద్రవ్యసంగ్రహః,

సేన్ద్రియం చేతనం ద్రవ్యం నిరిన్ద్రియ మచేతనమ్.

దీనిచే ఇంద్రియజ్ఞానముగలవి చేతనములనియు ఇంద్రియ జ్ఞానము లేనివి అచేతనము లనియు తెలియుచున్నది. చరక సంహితయందు పంచేంద్రియ జ్ఞానమునకు ఉదాహరణము ఈక్రింది విధముగఁ జూపియున్నారు.

1 జొప్రస్వతిసగుడు చక్షురింద్రియ జ్ఞానము గలది.
2 ఏలక తీగ శ్రవణేంద్రియ జ్ఞానము గలది.
3 చేదుపొట్ల ఘ్రాణేంద్రియ జ్ఞానము గలది.
4 వంగచెట్టు రసేంద్రియ జ్ఞానముగలది.
5 అశోకవృక్షము స్పర్శేంద్రియ జ్ఞానము గలదియని విమర్శగ జూపియున్నారు.

ఇది విశేషముగ ధనుర్వాయువులలో గుణమునుఁ జూపుచున్నది. ఈ వ్యాధియందు మాత్రము ఇతరమూలికలు జేర్చరాదు. అంతర్బహిర్భాగములలో వాయువుజనించిన కష్టసాధ్యమనియు ఏకభాగములో వచ్చిన సాధ్యమగుననియు వాడుక కలదు. ఆ భాగములలో వచ్చినచో ఇరువదినాలుగు ఘంటలలో రోగవిముక్తియో లేక రోగి విముక్తియో జెందుననియు దీనిప్రయోగముచే రోగము క్రమవృద్ధి ఎట్లగునో అటులనే క్రమశః తగ్గుచుండుననియు, వాడుకగలదు. ప్రతి ఒక్కొక ఘంటకు దీని మూలరసమును ఒక్కొకతులము

ఇచ్చుచు దోషసమయములలో వాతపుచిహ్నాలు తగ్గుచుండు కొలది ఔషధప్రిమాణమైనను లేక కాలవ్యవధియైనను జే యుచు చికిత్సించవలెను. వ్యాధి మించుచో ఔషధప్రిమాణ ము రెండుతులములకు మించక తులమునుండి రెండుతులముల వరకు హెచ్చింపవచ్చును. ఒకప్పుడు ఒకదోష సమయములో వ్యాధి ఉద్రేకత్వము తగ్గియుండి మరియొక సమయ ములో ప్రకోపించుచుండును. గాన వైద్యుడు రోగివెంట నుండి దేశ కాల వయోభేదముల నెఱింగి చికిత్సించిన కష్ట సాధ్యమగు ధనుర్వాయువునందు ఈ మూలిక చికిత్స శ్లాఘ్య ముగ నుండును. కష్టవ్యాధులలో దీనికి ఇతరమూలికలు జేర్చవచ్చును.

పెద్ద మా సు.

శ్లో॥ వృద్ధదారుః కటుస్తిక్తః స్నిగ్ధోష్ణాకఫవాతజిత్,
శ్వయథుం క్రిమి మేహాంశ్చ హంతి శోఫోదరంతథా॥

వత్సకాది గణములో జేరినఓషధి. అనేక ప్రియోగము లుగ జేయవచ్చును. విశేషముగ వాతము, గ్రిహిణి, శూల, నంజు, వ్యాధులకు గుణకారియై యున్నది. ఇందు నూనె జేర్చి వాడుటయు గలదు గాని సుకుమారు లోర్వజాలరు. ఏకమూలికగ మాత్రిము అతితీక్ష్ణతగ నుండనేరదు. చల్ల యందు నిడుట యిరుతెగలవారలకు సుగుణముగ నున్నది

మూడుతులముల నుండి అయిదుతులముల వరకు మూలత్వక్కు రసమును నివ్వవచ్చును. దినమునకు ఒక్కసారి వంతున మూడురోజులవరకు నివ్వవలెను.

పెద్దబెండ.

దీనిని సూతికాపాయువులలో నుపయోగించిన విశేష గుణమును జూపును. యితరమూలికలు అన్నిటికంటె ఈవ్యాధి యందు అతీతగుణకారి. ఏకమూలికగ నుపయోగము తక్కువగ నుండినను యితరమూలికలు సామాన్యముగ ఈవ్యాధి యందు ఉప్పి, చేగొండ, జేర్చినచో వ్యాధినివారించుచున్నవి. ఈఓషధిని జేర్చనిచో తక్కిన రెండుగలిపినను శీఘ్రగుణకారి యగుటలేదు. దినమునకు నాలుగు తులముల రసము వంతున వారమురోజుల వరకు నివ్వవలెను.

బదనిక.

శ్లో॥ వందాకః కఫవాతాస్ర రూక్షా వ్రణ విషాపహా,
తథా ఘూత వ్రణాన్ హాన్తి కాయసిద్ధికరః పరః॥

అనేకవృక్షముల మీద జీవించుచుండుటచే అనేకగుణములు గలిగి యున్నది. చింతచెట్టుమీద నుండు బదనికను దెబ్బలు తగిలిన వెంటనే త్రాగిన రక్తము ఒకప్రదేశముననే పేరక సంచలించి నొప్పిని తగ్గించుచుండును. ముదిరిన వేపచెట్టు మీద నున్నదానిని పెట్టుమందులచే మనస్సు చలించియున్న

వారికి యివ్వవలెను. జమ్మిచెట్టుననుండునది ఎక్కువ వీర్యవృద్ధి కై యుపయోగించును. దినమునకు పదితులముల రసము ఇవ్వవలెను. వారముదినములవరకు ఇవ్వవచ్చును.

ఒరిజెంక

శ్లో॥ గోజహ్వా వాతలా శీతగ్రాహిణీ కఫ పిత్తజిత్,
హృద్యా ప్రమేహా కాసాస్రవ్రణజ్వర హారాలఘుః॥

మేహ వాతకలుకలకు, నొప్పులకు దినమునకు ఇరువది తులముల రసమున్ను జిలకఱ్ఱ ఒక్కతులమున్ను గలిపి మూడు లేక అయిదు దినములు ఇవ్వవలెను. ఇందు పథ్యము మగశిశువు గలిగిన గేదె లేక గోవు యొక్క పెరుగును మాత్రమే భుజించవలెను.

జలురక్కసి.

శ్లో॥ గజకర్ణీ స్వాదు పాకీ తిక్తా చోష్ణా కఫాపహా,
శీతజ్వరంచ వాతంచ నాశయే దతికీర్తితా॥
కందోస్యాః పాండు శోథార్శ కృమి గుల్మోదరాపహః,
ఆనాహ వాత ప్లీహంచ గ్రహణీ మపి నాశయేత్॥

గర్భమందు క్రిములు ( నులిపురుగులు ) న్నప్పుడు దీని సమూలరసము దినమునకు రెండుతులముల వంతున ఇవ్వవలెను. గ్రహిణీ వ్యాధులలో ౹సపత్రములు అర్ధతులము పెరుగులో గలిపి ఇచ్చిన హరించును. మూడుదినములు

యివ్వవలెను.

బాలింత బోలు.

శ్లో॥ బోలం రక్తాహారం శీతం మేధ్యం దీపనపాచనం,
మధురం కటుతిక్తంచ దాహాస్వేద త్రిదోష జిత్।
జ్వరాపస్మార కుష్ఠఘ్నం గర్భాశయ విశుద్ధికృత్॥

బాలింత స్త్రీలకు మకిలనొప్పి యున్నపుడు రెండుతులముల రసమును దినమునకునివ్వవలెను. కేవలము నొప్పిని మాత్రమే హరించుటలేదు. గర్భమం దెట్టిమలము లున్నను వెలువరించి శూలను హరించుచుండును. జ్వరాదులలో ఇతర మూలికలకు గలిపి ఇచ్చినచో జ్వరహారము జేయుచున్నది. మూడు లేక అయిదు దినములవరకు ఇవ్వవలెను.

బూరగ.

శ్లో॥ శాల్మలీ శీతలా స్నిగ్ధా శుక్లశ్లేష్మ వివర్ధనీ,
అతిసార ప్రశమనీ రక్త పైత్య వినాశినీ॥

ప్రియంగ్వాది గణములో జేరి నిర్యాససారముగా గలిగి యున్నది. దీనితోడి మెలు పిచ్ఛావస్తికి నుపయోగమైయున్నవి. మేహవాతములలో అతిసారములలో నుపయోగించవలెను. శరీరమందు జీర్ణించి యున్న మేహఉడుకులను తగ్గించును. వాలుకపగులుటకు గుణమునిచ్చును. దినమునకు అయిదుతులముల రసము వంతున వారమురోజులు ఇవ్వవలెను.

శ్లో॥ ముండ తిక్తా కటుః పాకే వీర్యోష్ణా మధురా లఘుః,
మేధ్యా తీక్ష్ణా తథా బల్యా భేదినీ తు రసాయనీ.
గళగండంగండమాలా మపచీం కఫవాతకం.
అపస్మార ప్లీహా మేద శ్లీపదార్శ పాండురోగకం,
అరుచిం యోనిశూలంచ కాసమర్శశ్చ కృచ్ఛ్రకం,
పిత్తం చామ మతీసారం క్రిమి శ్వాసంచ కుష్ఠకం,
విషదోషం హరే దాశు చ్ఛర్దించైవ వినాశయేత్.

సురసాది గణములో జేరి పత్రిసారముగ నున్నది. ఒరి బీజ వ్యాధియం దుపయోగమై యున్నది. ఈ వ్యాధియందు దీనిరసమును ఒక్కతులమువంతున నిచ్చుచు గచ్చ ఆకును గాని లేక గచ్చ కాయ గంధమును గాని బీజమునకు నిడిన త్వరగ గుణముగలుగుచున్నది. దినమునకు ఒక్కసారి ఔషధ మునొసఁగుచు లేపనాదులజేయుచు పదునొకండు దినములు చికిత్సించిన వ్యాధి నివృత్తియగుచున్నది.

మంగ.

శ్లో॥ మదనః కటుక స్తిక్త స్తథామాస్ర గ్వ్రణాపహః,
శ్లేష్మ జ్వర ప్రతిశ్యాయ గుల్మ విద్రధి వాతజిత్.
శోఫా దాహా హరో వస్తి కాస జిద్వాంతి కృద్భవేత్.

ఇది వమన, నిరూహా, ఆరగ్వధాది గణములలో జేరి ఫల

సారముగా గలిగియున్నది. ఆరోగ్యశాస్త్రమందు దీని పుష్ప ములుమాత్రము కఫ దుష్టస్తన్య చికిత్సలో తల్లిస్తనములకు తేనెతో లేపనజేసి శిశువునకు స్తన్యమొసగిన వమనమై స్తన్య దోషము పోవునని యున్నది. గాని ఈ చప్పిడివిధానములో ఫలమును గాని పుష్పమును గాని స్వీకరించక మూలమును గ్రహించుచున్నారు. శిశువులు జనించినపుడు కొందఱికి బొడ్డుకు పైభాగములో సూదికాకలుఅని సూదులు గాల్చి గర్భముపై గాల్చుచుందురు. కొందఱట్లు చేయకయుండి అట్టి శిశువులకు అజీర్ణము గలిగినచో దీనిమూలరసమును గ్రహించి పాలలో ఒకతులము నిచ్చుచుందురు. గాఢమగు విరేచనములు గావించి ఆరోగ్యమగుచుండును. ఒక్కసారియే ఇవ్వవలెను. దీనికి పుల్లలమందు అనిపేరు.

## మామిడి.

శ్లో॥ ఆమ్రో గ్రాహీ ప్రమేహాస్ర కఫ పిత్త ప్రణాశ-
జయేత్,

పంచపల్లవములలో జేరి పూర్వాభాద్రా నక్షత్రమై యున్నది. నల్లమామిడిచెక్క రసమును ప్రదరములలో రుధిరవ్యాధుల లో నిచ్చిన సుగుణముం జూపుచున్నది. అయిదుతులముల రసములో నూనెబొట్లు ఏడువేసి ఇవ్వవలెను. ప్రతి చుక్కకు వేలును నూనెలో సమ్మానముగ ముంచి రసమందు వేయు

వలెను. లేనిచో నూనె ప్రిమాణము తప్పుచుండును. తైల బిందువులు సమానముగ నుండిననే గాని గుణకారి కాజాలదు. ఉష్ణప్రికృతి గలవారలకు ఋతుశూలను హరించుచున్నది. మూడుదినములు మాత్రిమే ఇవ్వవలెను.

ము చ్చ తు ని కి.

శ్లో॥ తుంబురుః కటు తిక్తోష్ణ కఫ మారుత శూలనుత్,
అపతంత్రోదరాధ్మానాః క్రిమిఘ్నో వహ్నిదీపనః॥

దీనికాయలను అంటువ్యాధులకును, రక్తముపడు వ్యాధులకును, దినమునకు పదితులములవంతున మూడుదినములు ఇచ్చిన ఆరోగ్యమగును.

. ర త్న పు రు ష .

శ్లో॥ శంఖపుష్పీ సరా మేధ్యా వృషా మానసరోగహృత్.
రసాయనీ కషాయోష్ణా స్మృతి కాన్తి బలాగ్నిదా,
దోషాపస్మార భూతాస్రి కుష్ఠ కృమి విష ప్రిణుత్.

దినమునకు నాలుగుతులములు సమూలరసమును పదితులముల పాలలో గలిపి వారముదినములవరకు ఇచ్చిన శుక్రినష్టము గలవారికి వయోబలమును గలిగించును. కొందరు లేహ్యముగ గూడ చేయుదురు.

రాగి.

శ్లో॥ పిప్పలో దుర్జర శ్శీతః పిత్తశ్లేష్మ వ్రణాస్రజిత్,
యోనిదోషం రక్తదోషం దాహపిత్త కఫాం జయేత్.
అశ్వత్థ వృక్షస్య ఫలాని పక్వా స్యతీవ హృద్యానిచ
శీతలాని, కుర్వంతి పిత్తాస్ర విషార్తిదాహ విచ్ఛర్ది
దోషా రుచి నాశనాని.

క్షీరవృక్షములలో జేరి పుష్యమీ నక్షత్రవృక్షమై యున్న
ది. విశేషముగ కుసుమవ్యాధులలో అయిదు తులముల రస
ములో రెండుతులముల ఆవునెయ్యి జేర్చి దినమునకు ఒక్క
సారి యిచ్చుచున్నారు. మూడు దినములు ఇవ్వవలెను.

రుద్రగణము.

ఇది సమస్త వాతవ్యాధులను హరించుచున్నది. గాని
ఇతర ఓషధులు గుణమగుపడనిచో దీనిని ఉపయోగించిన
గుణమగుచున్నది గాని ప్రథమములో ఈఓషధిని ప్రయోగిం
చిన సుగుణము గానిచో ఇతర మూలికల నుపయోగించినను
వాటిగుణమును గానివ్వక చేగచుచుండును. దీనికి వెణుతురు
ను జేర్చరాదు. దీనిసేవనగూందా ముప్పత్యముగాక సంవత్సర
మంతయు పథ్యాదులు చేయవలెను. కఠినపథ్యాదులు జేసి
నను విహారమునందు ..కు జాగరూకతతో మెలంగవలెను.
దినమునకు మూడుతులముల రసము నివ్వవలెను. వారము

రోజులకు పై నివ్వరాదు.

రుద్రజడ.

శ్లో॥ శతాహ్వా కటుకా తిక్తా స్నిగ్ధోష్ణా శ్లేష్మవాతనుత్,
జ్వర నేత్ర వ్రణాన్ హన్తి వస్తికర్మణి శస్యతే॥

దీని ఆకును వరుసజ్వరములో నిచ్చిన మాన్పుచున్నది. తములపాకునందు సున్నము కాచు వక్క బెట్టక దీని ఆకుల ౨ - ౩ వరకు ఇచ్చిన కొందఱికి మరుసటిదినమునుండి రాక పోవుటయు, మరికొందరికి రెండవదినము జ్వరమువచ్చిన తిరుగ నదేప్రకారముయిచ్చిన జ్వరము రాకయుండుటయు నున్నది.

కొడ్డివారినానబాలు.

శ్లో॥ హేమాహ్వా రేచనీ తిక్తా మందాగ్న్యక్లేదకారిణీ,
క్రిమి కండూ కఫానాహ విష కుష్ఠ వినాశినీ.

విరేచనములు గట్టుచున్నది. అజీర్ణవిరేచనములందు దీని నిచ్చినచో వెంటనే తనపిచ్ఛిలత్వముచే త్వరితముగ విరేచనములు నిలుపుచుండుటచే ఇతరవ్యాధుల నుత్పత్తి చేయుచున్నది. గ్రహిణీవ్యాధులలో పచ్చిరసమును అజీర్ణములలో వెచ జేసిన రసమును నాలుగుతులములున్ను, పెరుగు ఎనిమిదితులాములున్ను గలిపి ఒకదినమునకు నివ్వవలెను. మూడుదినముల వరకు యివ్వవచ్చును. దీనిరసమందు పాదరసమును భావన జేసినంతమాత్రాన తన సప్త కంచుక దోషములన్నియు

హరించునని రసవాదకులు జెప్పుచున్నారు గాని అనుభవ మంను అగుటలేదు.

వాలుకదవడ.

పక్షవాయువులలో దినమునకు పదితులముల రసము వంతున అయిదు లేక ఏడుపూటల వరకు నివ్వవలెను.

పారిజము.

శ్లో॥ పారిభద్రః కృమిశ్లేష్మ మేదః కఫానిలాపహాః.

దీనిని మహాకార శరీరులు ప్రతిసంవత్సరమును నుప యోగించుచుందురు. ఏకమూలికకంటె సురుగుడును జేర్చి వాడుటయే ఎక్కువగు గన్పించుచున్నది. గర్భవతులు సహి తము మాసభేదములు లేక నుపయోగించుచుందురు. ఓషధి యొక్క శక్తి ఒక్కసంవత్సరమువరకు శరీరమును పోషించు ననియు మరునటి సంవత్సరము తన వీర్యపటుత్వము నశించు టచే పునరపి సేవించవలెనని అనుభవజ్ఞుల నిర్బంధములై యున్నవి. దినమునకు పదితులముల రసమువంతున అయిదు లేక ఏడుదినముల వరకు నివ్వవలెను. సకల మహావ్యాధుల హరించును.

విష్ణుక్రాంత.

శ్లో॥ విష్ణుక్రాంతా కటుర్మేధ్యా క్రిమి వ్రణ కఫాన్ జయేత్
తాచ్ఛాఖిం విష దాహఘ్నం పిత్త వాతహరంగురు.

దీనిని వాత ఉబ్బసవ్యాధులు ప్రథమావస్థలో నున్నపుడు దినమునకు పదితులముల రసము వంతున అయిదుదినముల వరకు నిచ్చిన గుణమగును.

౩ డు రు.

శ్లో॥ పైణవః కటుతిక్తోష్ణ శ్శోథార్శో ప్రాణశూలజిత్,
కఫ కుష్ఠోదరం హంతి పిత్తలా గర్భపాతినీ॥

పునర్వసు నక్షత్ర వృక్షము. పిత్తహరగణము, గ్రంథుల కలిగించుటకును ప్రసూతిస్త్రీలకు గలుగు వ్యాధులకు ప్రథమ దినము అయిదుతులములును రెండవ దినము నాలుగుతులములును మూడవదినము మూడుతులములు నాలుగవదినమందు రెండుతులములున్ను అయిదవదినమందు ఒక్కతులమున్ను ఇవ్వవలెను. మధ్యలో గుణముగనున్న ఔషధము సేవించరాదు.

౩ ణు తు రు.

శ్లో॥ వేల్లాంతిరాశ్మ్రనుద్గ్రాహి కఫ కృచ్ఛ్రా నిలార్తిజిత్,
మూత్రదోషం విషంహన్తి రక్తాతి సార షుల్బణం॥

ఇది వీరతరాదిగణములో జేరిన ఓషధి. విశేషము వాతము లన్నిటిలోను గుణమగుపరచుచున్నది. పథ్యములందు ఉష్ణ ప్రకృతి వాతప్రకృతి గలవారలకు వేర్వేరు అయ్యుయున్నది. పై పథ్యమందు ఉష్ణమువారికి పాలతోను వాతప్రకృతిగలవారలకు ఉష్ణవస్తువులతోను భూమ్పగలిగి భుజింపును. విశేషముగ ఇతర

మూలికల కూడికకు నోర్వజాలక యుండును. చేకొనికిమాత్ర ము ఎన్నడును చేరక వైరవర్గమునందు జేరియున్నది. దీనిని గ్రహించుటలో నున్ను భేదము గలుగుచుండును. కేవలము మూలమును గ్రహించిన అతితీక్ష్ణత గల్గియుండును గాన ఎక్కు వప్రమాణములకు నోర్వజాలక ఉష్ణమధికమై వెంటనే శీతల ముగ మారుచుండును. ఓషధిసౌమ్యముగ నుండుటకు మొదలు చెట్టును నరికివేయవలెను. భూమిలోనుండి వచ్చిన మొలకపై వరిగడ్డివేసి మంటబెట్టవలెను. మరుసటిదినము మొలకను త్రవ్వి వేరుపై పట్టను గ్రహించిన వీర్యవంతమై దుర్గుణరహి తముగ నుండును. దినమునకు నాలుగుతులముల వంతున వారముదినములవరకు ఇవ్వవచ్చును. ఈచప్పిడియోగములో కీర్తివహించిన మూలికలలో నిదియొకటిగనున్నది. ఎంతటి సుగుణములను చేయగలిగియున్నదో అపథ్యాదులలో తద్వి పరీతముగ వ్యాధులను బుట్టించుచుండును.

సదసుద్రము.

గర్భశైత్యములలో గుణకారిగ నుండును. శ్వాసకఫ ములు జనించినప్పుడు దీనిసమూలరసము అయిదుతులములందు మానముఎత్తు మిరియాలు గలిపి యిచ్చిన ప్రాణముల రక్షిం చుచున్నది.

దీనిని మేహవాత రుగ్మతలలో నుపయోగించవలెను. విశేషముగ బాడిద (వారిజము) తో గలుపుచుందురు. ఏక మూలికగ నుపయోగించినచో రెంటియొక్క మిళిత ప్రయోగ ముకంటె కొంచము ఉష్ణము అధికముగ నుండును. కొఱుకు వ్యాధులలో దినమునకు నాలుగు తులముల రసము వంతున తొమ్మిది దినములవరకు ఇవ్వవలెను. ఇది బీజసారములో జేరి విషహారయువాగులో జేరుచున్నది.

పో మిం ద .

శ్లో॥ బలా మోటా విషశ్లేష్మ కృచ్ఛ్రఘ్న ద్విజయావ్రిదా॥

జ్వరగడ్డల ( జ్వరబల్లల ) యందు గుణమును జూపుచున్నది. రక్తక్షీణులకు మాత్రము ప్రమాణము తగ్గించుచుండవలెను. అతిసారములను హరించును సామాన్యమగు వ్యాధులలో దినమునకు ఒక్కతులమువంతున మూడు దినములకు పై మించక ఇవ్వవలెను.

హం స పా ది .

శ్లో॥ హంసపాదీ గురు శ్శీతా భూతాపస్మార నాశినీ,
విషజిత్ వ్రణహారీచ శూల శ్వాస వినాశినీ.

విదర్వాది గణములో జేరినది. ఈదేశమందు చెప్పంతట్టాకు అందురు. చర్మవ్యాధులలో దినమునకు అయిదుతులముల వంతున మూడుదినములు ఇచ్చిన గజ్జి, శోఫ, మున్నగు వన్ని

టిని హరించును.

జాతిపుష్ప.

శ్లో॥ శైలేయకం హిమం తిక్తం పిత్త కుష్ఠ విషాపహం,
రక్తదోష హరం బల్యం కందూ నిర్మూలకంవిదుః.

ఉష్ణాధిక్యతచే గలుగు మూత్రకృచ్ఛ్ర వ్యాధులలో గుణ కారియై యున్నది. దినమునకు అయిదుతులముల రసము వం తున వారమురోజుల వరకు నిచ్చిన మూత్రవస్తియందలి దోషములను హరించుచున్నది.

అతిమూత్రమునకు:— కొండపిండి వేళ్ల రసము మేడి చెక్క కషాయము సమముగ దినమునకు పదితులములవంతున వారముదినములు ఇవ్వవలెను.

ఉబ్బసమునకు:— కానుముణగ, చేగొండ, సుగంధి పాల, తక్కలి, మారేడు, ఉప్పి, వావిలి, ఇందు త్రికటుకము లుగలిపి శర్కర జేర్చిగ గాయుమాదిరి దినమునకు ఉసిరి కాయప్రమాణము వంతున వారముదినములు నివ్వవలెను.

కుసుమలకు:— ఆరె చెక్క, మేడిచెక్క, చిన్నంగి, ఉసిరిక చెక్క, అన్నియూ సమముగా జేర్చి దంచితీసిన నిజ రసముగాని లేక కషాయముగాని దినమునకు పదితులముల వంతున వారముదినములు ఇచ్చుచు పథ్యమునకు పల్లవపత్తి ఓయ్యము భోజనమునకై యివ్వవలెను.

బాలింతలకు:— రేగొట్టి రుద్రిగణము, ఉప్పి, పసు లోనిపందార, పాలకొడిసె ఇవి గాయమాదిరివండి ఉసిరిక కాయప్రమాణము వంతున వారముదినములు యివ్వవలెను. చలిజ్వరములకు గూడ నివ్వవచ్చును.

ఆహికజ్వరములకు:— పెద్దబెండ, గట్టుకొలిమిడి, గుంట గలగర, చిన్నంగి, చిన్నపెగ్గుమ్ముడు గలిపి కషాయముగ గాని గాయుగగాని యిచ్చిన గుణమగును. పైప్రమాణముగ దినము నకు ఇవ్వవలెను. దోషసమయములలో పసరు గున్న గలిపిన విశేషగుణమును జూపుచున్నది.

గర్భవతులకు:— సురుగుడు, వారిజము, చిన్నంగి.

సూతికలకు:— వెల్తురు, పెద్దబెండ, ఉప్పి, తెల చేగొండ.

కుసుమలకు:— మామిడి, జమ్మి, ఆరె.

మూత్రకృచ్ఛ:— నేలవుసిరి, పల్లేరు, జాతివువ్వు, కొండపిండి.

ఋతురక్తములకు:— అరటి, ఆరె, జమ్మి.

కామిలకు:— కామంచి, కాకర, జమ్మి, గలిజేరు.

పక్షవాయువు:— శ్లేష్మకొండి, రుద్రిగణం, ఉప్పి, విష్ణుక్రాంత.

కాసలకు:— రేగొట్టి, పసరుగున్న, కొడిసెపాల.

సంజులకు:— ఆముదపుఆకు, ఉప్పిఆకు, గొలిమిడివేళ్లు.



## త్రిమూలికల గుణములు.

| సం | ఓషధీనామములు | శత్రుత్వము | రుగ్మత | స్నేహము |
|---|---|---|---|---|
| 1 | అందుగ | దూసరి | వాతహారము | ఉప్పి |
| 2 | అవిస | ఊడుగ | విషహారి | కామంచి |
| 3 | అరటి | చెంజర్ల | త్రిదోషహారి | ఆరె_జమ్మి |
| 4 | ఆముదము | చప్పిడి | శ్లేష్మవాతము | ఉప్పి_గొలిమిడి |
| 5 | ఆరె | రాగి | కామెర్లు | జమ్మి. |
| 6 | ఇరుగుడు | చెంజర్ల | గ్రంధి | వెదురు,తంగేడు. |
| 7 | ఉప్పి | వారిజము | మూత్రిక | వెణుతురు,చిన్నంగి |
| 8 | ఊడుగ | దొండ | విషహారము | కామంచి |
| 9 | ఊదరేణు | చప్పిడి | రేచనకారి | బెండ, ఉప్పి. |
| 10 | ఎలుకచెవి | జీడి | అతిమూత్రము | కొండపిండి |
| 11 | కటారిమొన | చేకొణి | అంటువ్యాధి | జమ్మి ఆరె |
| 12 | కండొరికి | నెమలినార | శల్యఘ్ని | బూరుగ -వదనిక |
| 13 | కాకర | దొండ | కామిలా | గలిజేరు జమ్మి |
| 14 | మునగ | బాడిడి | మూర్ఛ | |
| 15 | కామంచి | చప్పిడి | కామిలా | గలిజేరు |
| 16 | కుంకుడు | తంగేడు | శ్లేష్మము | పాలకొడిసె |
| 17 | కూతురుబుడమ | నేలవుసిరి | పిత్తము | చిన్నంగి ఉత్తరేణు |
| 18 | కొండపిండి | మునగ | మేహశాంతి | పల్లేరు, రాతిపువ్వు |
| 19 | కోరింత | నేలవుసిరి | శ్లేష్మము | నల్లతీగె, రుద్రజడ |
| 20 | కోలముఖి | దూసరి | కాసహారి | ములక, నల్లతీగె |
| 21 | గచ్చ | బాడిద | శూల | ఉప్పి, జోడతరం |
| 22 | గలిజేరు | చేగొండ | కామిలా | కామంచి_గొలిమిడి |
| 23 | గండుత్తరేణు | ఊడుగ | పిత్తహారి | ఆరె_చిన్నంగి |
| 24 | గాడిదగడపా | చెంజ[illegible] | శూల | |
| 25 | గుంటగలగర | వె[illegible]లు | అంటువ్యాధులు | జమ్మి |
| 26 | గురిగింజ | కుంకుడు | వీర్యపుష్టి | పల్లేరు,తంగేడు |
| 27 | [illegible]డి | ఎలుకచెవి | నంజు | గలిజేరు, చిన్నంగి |

| నెం. | ఓషధీనామములు | శతృత్వము | రుగ్మత | స్నేహము |
|---|---|---|---|---|
| 55 | పల్లేరు | కుంకుడు | మేహశాంతి | తంగేడు, బూరుగ |
| 56 | పస్లోవిపంచదార | జీడి | జ్వరము | తుమ్మి, ములక |
| 57 | పాలకొడిసె | చప్పిడి | అతిసారము | బూరుగ గచ్చ |
| 58 | పాలబొట్లు | వెణుతురు | రక్తశోధన | జమ్మి ఆరె |
| 59 | పొద్దుతిరుగుడు | సురుగుడు | వాతము | మునగ చిన్నంగి |
| 60 | పెద్దమాను | మునగ | మేహము | బూరుగ ఆరె |
| 61 | పెద్దవెంప | వారిజము | సూతిక | ఉప్పి. వెమరు |
| 62 | బవనిక | ఇరుగుడు | వీర్యవృద్ధి | జమ్మి బూరుగ |
| 63 | బరివెంక | మూసవి | మేహవాతము | చిన్నంగి |
| 64 | బల్లురక్కసి | తంగేడు | క్రిమిహరి | కామంచి గొలిమిడి |
| 65 | బాలింతబోలు | చెంజర్ల | సూతిక | వెదురు |
| 66 | బూరుగ | విష్ణుక్రాంత | మేహశాంతి | ఆరె, జమ్మి |
| 67 | బోడతరము | బాడిద | అండవృద్ధి | గచ్చ |
| 68 | మంగ | చప్పిడి | ఆమదోషము | |
| 69 | మామిడి | చేగొండ | ప్రదరము | జమ్మి, ఆరె |
| 70 | తుమికి | మునగ | అంటువ్యాధి | నక్కెర గుంటగల |
| 71 | రత్నపురుష | జీడి | వీర్యపుష్టి | కొండపిండి (గర |
| 72 | రాగి | ఇరుగుడు | కుసుమ | మామిడి, ఆరె |
| 73 | సుప్రిగణము | వెణుతురు | వాతము | పాలకొడిసె |
| 74 | రుద్రజడ(బాలు | నేలవుసిరి | జ్వరహారి | తుమ్మి ములక |
| 75 | రెడ్డివారినాన | పల్లేరు | గ్రాహి | పాలకొడిసె (మ |
| 76 | వాలుకపవష | నెమలినార | పక్షవాతము | ఉప్పి, మాతురుబుడ్డ |
| 77 | వారిజము | గుంద్రిగంధము | మేహశాంతి | సురుగుడు |
| 78 | విష్ణుక్రాంత | చేకొణి | వాతము | ఖోదరేణు |
| 79 | వెమరు | వారిజము | సూతిక | అరటి, మునగ |
| 80 | వెణుతురు | చేకొణి | వాతము | చిన్నంగి |
| 81 | సరుగుడు | కూసరి | శైత్యము | ఉప్పి-ములక |

| సం | ఓషధి నామములు | శత్రుత్వము | రుగ్మత | స్వభావము |
|---|---|---|---|---|
| ౮౨ | గురుగుడు | నెమలినారం | మహాశాంతి | వారిజము |
| ౮౩ | పోటిండ | మంగ | అతిపాతము | పాలకొడిశ |
| ౮౪ | హంసపాది | నెమలినార | చర్మవ్యాధి | కొండ |
| ౮౫ | పారిఘర్వ | దద్రిగణము | మూత్రకృచ్ఛ్ర | వేంపుకిర |

బహుసంఖ్యగల ఓషధుల మేళవింపునందు శత్రుమిత్రత్వ జ్ఞాపనకంటె వ్యాధిహరమగు తత్వము ఆయోగమందు జనింప చేయుటయే ప్రాముఖ్యము.

శ్లో॥ గుణదోషౌ బుధో గృహ్ణన్ ఇందుక్ష్వేళావివేశ్వరః।
శిరసా శ్లాఘ్యతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి॥

సమాప్తము.

# రోగ నక్షత్ర పాదపరిమిత దినదోష శాంతి బలిదాన విధానములు.

అశ్విని, ప్రథమపాదము 9 ద్వి॥ 10 తృ॥ 10 చతు॥ 45 దినములుదోషము ఉత్తరేణి వేరుధరించుట, ఖండ యవాజ్యహోమం, సువర్ణఘృత కుంభదానం. చందనగంధము, తామరపుష్పము, గుగ్గులధూపము, ఘృత దీపము, గుడ నైవేద్యము, గుడాన్న బలి.

భరణి, ప్ర॥ 0 ద్వి॥ 80 తృ॥ 40 చ॥ 12 దినములు. ఆవిసెవేరుధరించుట, ఘృత మధు తిలాక్షత హోమము, గోమహిషదానము. అగరుగంధము, గన్నేరుపుష్పము, గుగ్గులు, ఆజ్య ధూపము ఆజ్యదీపము, గుడాన్న నివేదన ఖిచిడిబలి.

కృత్తిక, ప్ర॥ 9 ద్వి॥ 11 తృ॥16 చ 38 దినములు. పత్తివేరు ధరించుట, తిల యవ ఆజ్య హోమము, స్వర్ణ గోదానము. చందనగంధము, మొల్లిపుష్పముగుగ్గులు ఆజ్య ధూపము ఆజ్యదీపము, మాగాన్ననివేదన పాయసబలి.

రోహిణి, ప్ర॥ 8 ద్వి॥ 10 తృ॥38 చ॥ 30 దినములు ఉత్తరేణువేరు ధరించుట, తిల యవ ఆజ్య హోమము కృష్ణగోదానము. చందనగంధము, తామరపుష్పము, దశాంగధూపము, ఘృతదీపము, ఆజ్యపాయస నైవేద్యం శాల్యన్నబలి.

మృగశిర ప్ర॥19 ద్వి॥ 30 తృ॥ 22 చ॥ 21 దినములు తక్కిలివేరు ధరించుట, దధిపాయసహోమము,సవత్స గోదానము. చందనగంధము, తామరపుష్పము, దశాంగధూపం ఆజ్యదీపం, పాయసాన్న నైవేద్యం దధ్యన్నబలి.

ఆర్ద్ర ప్ర॥ 0 ద్వి॥ 18 తృ॥ 0 చ॥ 0 దినములుగంధపుచెక్క రాగివేరు ధరించుట, ఆజ్యమధు హోమము, కృష్ణవస్త్ర దానము. చందనగంధము పరిమళపుష్పము, దశాంగధూపము, ఆజ్య దీపం, పాయసాన్న నైవేద్యము దధ్యన్నబలి

21 దినములు దోషము. జిల్లెడువేరు ధరించుట,

పునర్వ ప్రథమాదిగా నాల్గు పాదములకు 7 - 14 - 16 - 21 దినములు దోషము. హారిద్రాకుంకుమగంధము చేమంతిపుష్పము అష్టగంధ
ఆజ్యతండులహోమము కమలపంచక దానము,
ధూపము పీతాన్ననివేదన పీతతండులబలి.

దినములు దోషము. చిత్రిమూలపు వేరుధరించుట
పుష్య ప్రథమాదిగా నాల్గుపాదములకు 8 - 7 - 20 - 21 దినములు దోషము. కుంకుమగంధము తామరపుష్పము గుగ్గులధూపము శర్కర
ఆజ్యపాయసహోమము పీతవస్త్రదానము
నివేదన మోదకబలి.

ఆశ్లేష ప్రథమాదిగా నాల్గుపాదములకు 0 - 0 - 41 - 0 దినములు దోషము, పొట్లవేరు ధరించుట, శర్కర
ఆజ్యహోమము సవత్సకృష్ణ గోదానము, కుంకుమాగరు గంధము అవిశె పుష్పము గుగ్గులధూపము,
ఆజ్యదీపము క్షీరాన్ననైవేద్యము దధ్యన్నబలి.

మఖ ప్రథమాదిగా నాల్గుపాదములకు 15 - 7 - 17 - 20 - దినములు దోషము, గుంటగలగరవేరు ధరిం
చుట. తిలాజ్యతండులహోమము, వస్త్రతిల మాషదానము. శ్వేతగంధము చంపక పుష్పము గుగ్గుల
ధూపము ఆజ్యదీపము అజ్యాన్న నైవేద్యము అజ్యాన్నబలి.

పుబ్బ ప్రథమాదినాల్గు పాదములకు 0 - 5 - 0 - 30 దినములుదోషము. వాకుడువేరు ధరించుట, తిల
ఆజ్యహోమము స్వర్ణగోదానము. శ్వేతగంధము మాలతీపుష్పము, బిల్వాజ్యధూపము ఆజ్యదీపము,
ఆజ్యపాయస నైవేద్యము పాయసాన్నబలి.

ఉత్తర ప్రథమాదినాల్గు పాదములకు 7 - 14 - 7 - 60 దినములు దోషము, పొట్లవేరు ధరించుట, తిలా
జ్యహోమము, స్వర్ణదానము. కర్పూరగంధము జిల్లెడుపుష్పము గుగ్గులధూపము ఆజ్యదీపము ఆజ్యపా
యస నైవేద్యము శర్కరాన్నబలి.

హస్త ప్రథమాదిగా నాల్గుపాదములకు 15 - 17 - 15 - 5 దినములు దోషము. జాజివేరుధరించుట, దధి
ఆజ్యహోమము సువర్ణదానము. రక్తచందనము తామరపుష్పము గుగ్గుల ధూపము ఆజ్యదీపము ఆజ్య

## ౨౭ నక్షత్ర పాదజనిత దినదోష శాంతి బలిదాన విధానములు.

పాయస నైవేద్యము తిలాన్న బలి.

చిత్త ప్రథమాదిగా నాల్గుపాదములకు 11 - 9 - 8 - 16 దినములు దోషము. మొక్క-బుచెట్టువేరు ధరించుట. తిలాజ్యతండుల హోమము వృషభదానము, అగరుగంధము చిత్రవర్ణ పుష్పము గుగ్గులధూపము ఆజ్యదీపము శుద్ధోదక నైవేద్యము చిత్రాన్న బలి.

స్వాతి ప్రథమాదిగా నాల్గుపాదములకు 17 - 3 - 5 - 5 దినములు దోషము, జాజివేరు ధరించుట, తిలాజ్య హోమము, స్వర్ణ రక్త ధేను దానము, చందనగంధము దవనపుష్పం అగరు గుగ్గిల ధూపము ఆజ్యదీపము ఆజ్యపాయస నివేదన, ఆజ్యపాయసబలి.

విశాఖ ప్రథమాదిగా నాల్గుపాదములకు 15 - 4 - 13 - 11 దినములు దోషము. గురివింద వేరు ధరించుట, ఆజ్యపాయస హోమము రక్తపీత వస్త్రదానము. చందనగంధము తామరపుష్పం దేవదారు ఆజ్య ధూపము ఆజ్యదీపము పాయసనివేదన చిత్రాన్న బలి.

అనూ ప్రథమాదిగా నాల్గుపాదములకు 60 - 12 - 36 - 30 దినములు దోషము. సుపుష్పమూలము ధరించుట, యవాజ్య హోమము స్వర్ణగోదానము కేసరగంధము తామరపుష్పము, చందనధూపము ఆజ్య పాయస నివేదన మాషాన్న బలి.

జ్యేష్ఠ ప్రథమాదిగా నాల్గుపాదములకు 9 - 5 - 9 - 46 దినములు దోషము. ఉత్తరేణివేరు ధరించుట, తిల తండుల హోమము. నీలవస్త్ర దానము, చందనగంధము చంపకపుష్పము కర్పూర ధూపము ఆజ్య దీపము చిత్రాన్న నివేదన దధ్యన్న బలి.

మూల ప్రథమాదిగా నాల్గుచరణములకు 0 - 9 - 15 - 11 దినములు దోషము. మందారవేరు ధరించుట, ఆజ్యతండుల హోమము స్వర్ణ వస్త్రదానము కృష్ణాగరుగంధం నల్లకలువపుష్పము కృష్ణాగరుధూపము, ఆజ్యదీపము మాషాన్న నివేదన మాషాన్న బలి.

